RBHB0211 16

# చదరంగ యోధులు

## [ప్రేమచంద్ కథలు-2]

అనువాదం:

చావలి రామచంద్రరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ-4

3

# విషయానుక్రమణ

# చదరంగయోధులు

వజీద్ అలీఖాన్ పరిపాలించే రోజులవి. లక్నో భోగవిలాసాల నిషాలో మునిగితేలుతోంది. చిన్నా, పెద్దా, ధనికా, పేదా అందరూ ఈ భోగలాలసత్వంలోనే మునిగిపోయారు. నృత్య గాన సభల్లో తన్మయుడయ్యేవాడొకడు; నల్లమందు కైపులో కునికిపాట్లు పడేదొకడు. నిత్య జీవితంలో ప్రతి రంగంలోనూ భోగ విలాసాలు ప్రాధాన్యం వహించాయి. రాజ్యపరిపాలనలో, సాహిత్యక్షేత్రంలో, కళాకౌశలంలో, పరిశ్రమల్లో, ఆహారవిహారాల్లో – అన్ని రంగాల్లోనూ విలాస వ్యసనాలు వ్యాపించిపోతున్నాయి. రాజోద్యోగులు విషయ వాసనల్లోనూ, కవులు ప్రణయ విరహాల వర్ణనల్లోనూ, పనివాళ్ళు పట్టుబట్టల బుటాదారీ పనుల్లోనూ, చిత్రవిచిత్రమయిన పూల అల్లికలు నిండిన మేలిమి వస్త్రాలు తయారు చెయ్యటంలోనూ, పారిశ్రామికులు సుర్మా, సెంట్లు, రకరకాల అభ్యంగన సామాగ్రి తయారుచెయ్యటంలోనూ నిమగ్నులయ్యేవాళ్ళు. అందరూ భోగవిలాసాల కైపులోనే మునిగి తేలుతున్నారు. ప్రపంచంలో ఏమి జరుగుతున్నదనే విషయం ఎవరికీ పట్టటంలేదు. ఒకవైపు కోడిపందాలు జరుగుతున్నాయి. మరో

పక్క పొట్టేళ్ళ పందాలకు సన్నాహాలు చేస్తున్నారు. మరోచోట పచ్చీసు పందెం సాగుతోంది. విజయోత్సాహంతో కోలాహలంగా ఉంది. ఇంకోచోట ఘోరంగా చదరంగయుద్ధంజరుగుతోంది. మహారాజు మొదలు ఆగర్భదరిద్రుడి వరకూ ఈ వ్యసనాల్లో మునిగి తేలుతున్నారు. చివరకు ఫకీర్లుకూడా నాలుగు రూకలు దొరికితే రొట్టెలు తినటం మానేసి నల్లమందుకో, గంజాయికో తయారవుతున్నారు. 'చదరంగం, చీట్లపేక, మూడు ముక్కలాట — వీటివల్ల బుద్ధి సునిశితమవుతుంది. ఆలోచనాశక్తి అధికమవుతుంది. చిక్కు సమస్యలను పరిష్కరించే అభ్యాసం అలవడుతుంది' - ఇలాంటి వాదనలన్నీ జోరు జోరుగా వినిపిస్తుండేవి. (ఈ మతస్థులు ప్రపంచంలో ఇప్పటికీ లేకపోలేదు.) అందువల్లనే మీర్జా సజ్జదాలీ, మీర్ రౌశనాలీలు యిద్దరూ తమ కాలంలో అత్యధిక భాగం మెదడుకు పదును పెట్టుకోటానికి వినియోగించే వాళ్ళంటే, ఆలోచన గలిగిన ఏ వ్యక్తికైయినా అభ్యంతర మెలా ఉంటుంది చెప్పండి. తాతలనాటి సొత్తు ఇద్దరికీ ఉంది. బ్రతుకు తెరువునుగురించి ఎలాంటి చింతా లేదు. ఇంట్లో కూర్చుని హాయిగా విలాసాలతో కులుకుతున్నారు. అంతకంటె ఇక చేసే పనిమాత్ర మేముందీ! ప్రొద్దున్నే లేచి మిత్రు లిద్దరూ భోజనంచేసి, చదరంగ తివాసీ పరిచి బైఠాయించేవాళ్లు. పావులు అమర్చేవాళ్ళు. ఇక యుద్ధం మొదలై, ఎత్తు పైయెత్తులు సాగేవి. రెండు ఝాములు గానీ, మూడు ఝాములుగానీ, సాయంత్రమే గానీ వాళ్ళ కేమీ తెలిసేదే కాదు. "భోజనం తయారైంది" అని ఇంట్లోనుండి మాటి మాటికీ పిలుపు. "ఇదిగో ఇప్పుడే వస్తున్నా! దస్తర్ ఖాన్ పరుస్తుండు" అని ఇక్కడనుండి జవాబు. చివరకు వంటవాడు గత్యంతరంలేక భోజనం గదిలోకే తెచ్చిపెట్టి వెళ్ళిపోయేవాడు. ఇక మిత్రు లిద్దరూ రెండు పనులూ తోడుతోడుగా సాగించేవాళ్ళు. మీర్జా సజ్జదాలీ ఇంట్లో ముసలీ ముతకా ఎవరూలేరు అందువల్ల ఆట ఆయన దివాణం లోనే సాగుతుండేది. అలా అని మీర్జా కుటుంబంలోని వాళ్ళందరికీ ఈ వ్యవహారం నచ్చిందనికాదు. ఆయన భార్య సంగతి ఇంక వేరే చెప్పాలా! పేటలో వాళ్ళంతా, చివరకు ఇంట్లో పనిపాటల వాళ్ళుకూడా రోజూ

కటువైన వ్యాఖ్యానాలు చేస్తుండేవారు. "వట్టి దిక్కుమాలిన ఆట. ఇల్లు వల్లకాడు చేసేస్తోంది. అల్లా (దేవుడు) ఎవణ్ణీ ఈ వ్యసనంలో పడనివ్వకూడదు. మనిషి ఉట్టికీ – స్వర్గానికీ ఎందుకూ కాకుండా భ్రష్టుపట్టి పోతాడు. రెంటికీ చెడ్డ రేవడౌతాడు. ఇదొక పెద్ద వ్యాధి."

మీర్జా యొక్క భార్యకు ఈ ఆటంటే ఎంతో అసహ్యం. సందు దొరినప్పుడల్లా పేచీ పెడుతూనే ఉండేది. కాని ఆమెకు పేచీ పెట్టడానికి సామాన్యంగా వీలు కూడా చిక్కేది కాదు. ఆమె ఇంకా నిద్రమంచంమీద ఉండగానే, యిక్కడ ఆట ప్రారంభ మయ్యేది. ఇక రాత్రిపూట కూడా ఆమె నిద్రపోయిన తరువాత యెప్పటికో వెళ్ళేవాడు యింట్లోకి. ఆమె తన కోపమంతా నౌకర్ల మీద వెళ్ళబోసుకునేది. "కిల్లీ కావాలన్నారా ? వచ్చి తీసుకుపొమ్మని చెప్పు. తింటానికి కూడా తీరిక లేదా ఏం ? తింటాడో లేక ఎలుక లకూ కుక్కలకూ పెట్టుకుంటాడో మన కెందుకుగానీ, ఆ అన్నం తీసు కుని వెళ్ళి మొహాన గొట్టిరా!" అంటు ండేది. అయినా ఆమెకూడా ఎదుట ఏమీ అనగలిగేది కాదు. ఆమెకు తన భర్తకంటేకూడా మీర్‌సాహెబ్ అంటేనే గిట్టేదికాదు. ఆయనకు ఆమె మీర్ బిగాడూ (యితరులను పాడుచేసేవాడు) అని నామకరణం చేసింది. బహుశా మీర్జా తన నిర్దోషిత్వాన్ని ప్రకటించుకోటంకోసం నేరమంతా మీర్ సాహెబ్‌కు అంటగట్టేవాడు కాబోలు !

ఒకరోజు మిర్జా భార్యకు తలనొప్పివచ్చింది. ఆమె దాసీని పిలిచి "పోయి నవాబుగారిని పిలుచుకురా ! ఏ వైద్యుడి దగ్గరకైనా పోయి మందుతేవాలి. పో ! త్వరగా వెళ్ళు" అన్నది. దాసీ వెళ్ళి ఆసంగతి చెబితే "ఇదుగో ! యిప్పుడే వస్తున్నా, పద" అన్నారు మీర్జా గారు. బేగమ్ సాహబా చాలా కోపిష్టిస్వభావం కలది. ఆమె తల నొప్పితో బాధపడుతుంటే, భర్త చదరంగమాడుతూ కూర్చోటానికి గుండెలే ! ముఖం కందిగడ్డయిపోయింది. "తా నిప్పుడు వస్తాడో లేక వైద్యుడిదగ్గరకు నన్నే పొమ్మంటాడో చెప్పమను" అన్న దామె దాసీతో. మీర్జా ఆట మాంచి రసఘట్టంలోఉంది. రెండే రెండు ఎత్తుల్లో

మీర్‌సాహెబ్‌ను ఓడించబోతున్నాడు. "ఏం ? అంత ప్రాణాలు పోతున్నాయా ? కాస్త ఓర్చుకోలేదూ ?" విసుక్కుంటూ అన్నాడు మిర్జా.

"కాస్త అటుపోయి వినిరాకూడదూ ? ఆడవాళ్లు సహజంగా సుకుమారులు."

"నిజమే ! ఎందుకు వెళ్ళనూ ? రెండు ఎత్తుల్లో మీరు ఎలాగూ ఓడిపోతుండిరి !"

"అంత సులభం కాదండోయ్ ! పావులు ముట్టుడి సినంత మాత్రానే ఓడిపోతా ననుకున్నారా ? ముందు మీరు వెళ్లి మాట్లాడి రండి. ఉత్తపుణ్యానికి ఆమె మనసు కష్టపెట్టట మెందుకూ !"

"ఆమాటమీదే ఉండండి. ఓడించి మరీ వెళ్తాను. కాచుకోండి !"

"నేను ఆడనే ఆడను. ముందు మీరు వెళ్లి విచారించి రండి."

"అరె ! భాయీ ! వైద్యుడిదగ్గర కెళ్ళా లిప్పుడు. తెలుసా ? నన్ను వేధించేందు కిదొక సాకేగాని తలనొప్పీ లేదు, మట్టీలేదు."

"ఏమైనా కానీ ! ఆమె మాటకూడా కాస్త పాటించాలి."

"సరేలే ! ఇంకొక ఎత్తు వేద్దాం."

"ఉహుఁ ! మీరు వెళ్ళి వచ్చిందాకా పావుమీద చెయ్యికూడా వెయ్యను."

మీర్జా యిక తప్పనిసరై లోపలికి వెళ్లాడు. బేగమ్‌సాహెబా కొరకొర చూస్తూ మూలుగుతూనే "ఆ దిక్కుమాలిన చదరంగం అంటే యింత వ్యసనమా ! ఇవతల ఎవరైనా చచ్చినాసరే అక్కడి నుండి కదలరాయె. మీ వంటి మనుషులు అసలు పుట్టనేకూడదు." అన్నది.

"ఏం చెయ్యనూ ? మీర్‌సాహెబ్ రానీకపోతె ? ముప్పు తిప్పలు పడి ఎలాగో వదిలించుకు వచ్చాను."

"తనమాదిరే ఇతరు లందరికీకూడా పనీ పాటు ఉండవనుకుంటు న్నాడా ఏం ? ఆయనకుకూడా పెళ్ళాం, పిల్లలంటూ ఉన్నారా? అంద రినీ అఖరు చేసేశాడా ?"

"వట్టి వ్యసనగాడు. ఆయన వస్తుంటే తప్పనిసరై ఆడక తప్ప టంలా ! ఏం చెయ్యనూ ?"

"నాలుగు చీవాట్లు పెట్టరాదూ ?

"సాటివాడు! వయస్సులో, హోదాలో నాకంటె ఒక మెట్టు ఎక్కువైనవాడు. కాస్తమర్యాద పాటించక తప్పుతుందా ?"

"అయితే నాలుగు విదిలింపులు నేనే విదిలిస్తాను. కోపమొస్తే రానీ! ఎవడి మోచేతినీళ్ళు ఎవడు తాగుతున్నాడు ? అలిగితే అయనిఃటికి ఆయన పోతాడు. అంతేగా? హిరియా, పోయి ఆ చదరంగం తీసుకురా. అయ్యగారు యిప్పుడు రారు, తమరు యింటికి దయచెయ్యొచ్చని చెప్పిరా మీర్ సాహెబ్‌గారితో."

"ఆఁ! ఆఁ! అంత కోపమొస్తే ఏట్లా ? అవమానపరుద్దా మను కుఃటున్నావా ? ఏమిటది ? హిరియా! అగు! ఎక్కడికి వెళ్ళేది!"

"పోనివ్వ రెందుకనీ ? దాన్నాపితే నన్ను చంపుకున్నట్లే. ఉహూఁ! దాన్ని సరే ఆపారు. నన్నాపండి తెలుస్తుంది."

ఈ మాట అని బేగమ్ సాహబా మండిపడుతూ దివాణం వైపుకు వెళ్ళింది. పాపం మీర్జా ముఖాన నెత్తురుచుక్క లేదు. బేగమ్‌ను బ్రతిమాల సాగాడు! "అల్లా తోడు! హజరత్ హుస్సేన్ తోడు! అక్కడికి వెళ్ళితే నన్ను చంపుకున్నట్లే!" కాని బేగమ్ ఒక్కటీ లెక్కచేయలేదు. దివాణం గది వాకలి దాకా వెళ్ళింది. కాని అకస్మాత్తుగా పరాయిమగవాడి ఎదుట పడటానికి కాళ్ళాడ లేదు. లోపలికి తొంగి చూచింది. అదృష్టవశాత్తూ గదిలో ఎవ్వరూ లేరు. మీర్‌సాహెబ్ ఒకటి రెండు పావులు యిటువటూ అటువిటూ మార్చి, ఏమీ ఎరగనట్లుగా బయటుపచార్లుచేస్తున్నాడు. ఇంకేముంది! బేగమ్ లోపలికి వెళ్ళి ఆటంతా చెల్లా చెదరు చేసింది. కొన్ని పావులు బల్లక్రింద పారేసింది. కొన్ని బయటికి విసిరికొట్టింది. లోపలనుండి తలుపులు మూసి గొళ్ళెంపెట్టి వేసింది. మీర్‌సాహెబ్ వాకిలిదగ్గరే ఉన్నాడుగా, పావులు బయటపారెయ్యటం చూచాడు. గాజుల గల గల కూడా విన్నాడు. పైగా తలుపుకూడా బిగించె. బేగమ్ సాహెబాకు కోపమొచ్చిందని గ్రహించాడు. చల్లగా యింటితోవ పట్టాడు.

"మొత్తానికి రభస చెయ్యనే చేశావు," అన్నాడు మీర్జా.

"ఈసారి మీర్‌సాహెబ్ యిక్కడికి రానీ చెబుతా! నుంచున్నవాణ్ణి నుంచున్నట్లు గెంటిస్తాను. ఇంతటి భక్తి ఆ అల్లాఅంటే ఉండరాదూ? అబ్బే! ఆ పని చేస్తే పాపం రాదూ? తమ రక్కడ చదరంగమాడుతూ కూర్చుంటే, ఈ సంసారమంతా నేను ఈదాలన్న మాట! ఇకనైనా వైద్యుడి దగ్గరకు వెళ్తారా? ఇంకా యిక్కడే తారట్లాడుతారా?"

మీర్జా యింటినుండి బయలు దేరాడు. వైద్యుడి యింటికి వెళ్ళటానికి బదులు మీర్‌సాహెబ్ యింటికి చేరుకున్నాడు. జరిగిందంతా చెప్పాడు.

"పావులు వాకిట్లో పడ్డప్పుడే గ్రహించాను నేను. వెంటనే పలాయనం చిత్తగించాను. మంచి కోపిష్టి మనిషల్లే ఉందే! కాని మీ రామెను అనవసరంగా నెత్తికెక్కించుకోటం ఏమంత బాగుండలా! మీబయట వ్యవహారాలతో ఆమెకేమి సంబంధం? ఆమె పనల్లా యిల్లు చక్కబెట్టుకోటం. అంతే! కాని యితర విషయాలతో ఆమెకేం పని?" అన్నాడు మీర్‌సాహెబ్.

"అది సరేగాని, యింతకూ మన దుకాణం ఎక్కడ పెడతాం చెప్పండి" అన్నాడు మీర్జా.

"అందుకు దిగు లేముంది? ఇంత పెద్ద భవనం ఉంది. ఇక్కడే కూర్చుందాం."

"మరి బేగమ్‌కు ఎలా నచ్చ చెప్పనూ? మా యింటి వద్ద కూర్చుంటేనే యింత గొడవ చేసింది. ఇక ఇక్కడ సాగిస్తే ఊపిరితో ఉండనిస్తుందీ?"

"వాక్కుంటేవాగుకోనీయండి. నాలుగురోజులుగడిస్తే ఆమే సర్దుకుంటుంది. ఆఁ! మీరు ఒక పని చెయ్యండి: ఈ రోజు నుండీ కాస్త బెట్టుగా మాత్రం ఉండండి!"

# 2

మీర్‌సాహెబ్ భార్యకు మాత్రం - కారణ మేమిటో తెలియదు గాని - ఆయన ఇంట్లో లేకుంటేనే హాయిగా ఉండేది. అందువల్ల ఆమె ఎప్పుడూ ఆయన చదరంగ వ్యసనాన్ని విమర్శించేదికాదు. ఎప్పుడైనా మీర్‌సాహెబ్ జాగుచేస్తేగుర్తుచేసి కూడాపంపేది. ఈకారణాలవల్ల తన భార్య చాలా వినయ విధేయతలు గలదనీ, గంభీరమైన మ'షనీ మీర్ సాహెబ్‌కు ఒక భ్రమ ఏర్పడిపోయింది. కాని, చదరంగం యిక్కడనే ప్రారంభించి మీర్ సాహెబ్ రోజంతా యింట్లోనే ఉండటం మొదలుపెట్టినప్పటినుంచీ ఆమెకు చాలా యిబ్బందిగా ఉంది. ఆమె స్వేచ్ఛకు అటుంకం కలిగింది. రోజంతా వాకిలివైపు తొంగిచూడటానికి పరితపించిపోయేది.

అటు నౌకర్లలోకూడా గుసగుసలు ప్రారంభమైనాయి. అంతకుముందు వాళ్ళు రోజంతా పనీ, పాటూ లేకుండా గోళ్లు గిల్లుకుంటూ కూర్చునేవాళ్ళు. ఇంట్లోకి ఎవరైనా రానీ పోనీ, వాళ్ళకేమీ సంబంధ ముండేదికాదు. కాని, యిప్పుడలా కాదు. రాత్రింబవళ్లు ఒక టు రాపిడైపోయింది. ఒకసారి తాంబూలం తెమ్మంటే, యింకోసారి మిఠాయిలు తెమ్మనేవాళ్లు. ఇక హుక్కాసంగతి చెప్పనే అక్కరలేదు. ప్రేమికుని హృదయంలాగా నిరంతరం రాజుతూనే ఉండేది. బేగమ్ సాహబా వద్దకు వెళ్లి మాటిమాటికి యిలా ఫిర్యాదుచేసేవాళ్ళు: "అమ్మగారూ! నవాబుగారి చదరంగంతో మా దుంప తెగిపోతోంది. రోజంతా తిరిగి తిరిగీ కాళ్ళు బొబ్బలెక్కి పోతున్నాయి. ప్రొద్దున కూర్చుంటే ప్రొద్దుగూకి లేవటమా? ఇదెక్కడ ఆట అమ్మగారూ? గంటో, అరగంటో ఉల్లాసంగా ఆడుకుంటే ఫరవాలేదు. అయినా మాకేమీ కష్టం లేదనుకోండి. మీ సేవకులం, చెప్పిన

పనల్లా చెయ్యటమే మా పని. అయినా ఈ ఆట పట్టి దిక్కుమాలిందండీ! ఈ ఆట ఆడేవాడు ఎక్కిరాడు. ఇంటికేదో ఆపద చుట్టుకునితీరుతుంది. ఈయనగారి వ్యసనం గురించి ఒకరి తరువాత ఒకరుగా క్రమక్రమంగా పేటకు పేటంతా అల్లుకుపోతోంది. పేటలో ఏ మూల చూచినా ఇదే చర్చయిపోతే! అయ్యగారి ఉప్పూ, పులుసూ తింటున్నవాళ్ళం యజమానికి చెడ్డపేరు వస్తుంటే చూడలేకుండా ఉన్నాం. కాని మేమేం చెయ్యగలం?"

"అసలు నాకు ఆ ఆటంటే అసహ్యం. కాని ఆయన ఎవరి మాటా వినడాయె మరి! ఏం చేయ్యగలం?" అని జవాబిచ్చేది బేగమ్.

పేటలో ఉన్న ఒక రిద్దరు పూర్వకాలపు వాళ్ళుకూడా అశుభాన్నిగురించి అనేక రకాలైన ఊహలు చేస్తుండేవాళ్ళు. "ఇక లాభం లేదు. మన శ్రీమంతు లీ స్థితిలో ఉంటే ఇక ఈ దేశాన్ని అల్లాకూడా కాపాడలేడు. ఈ చదరంగం, రాజ్యం సర్వనాశనం గావటానికే వచ్చింది. అన్నీ అపశకునాలే కనబడుతున్నాయి." అనేవాళ్ళు.

రాజ్యంలో ఎక్కడ చూచినా ఆర్తనాదాలే. ప్రజలను పట్టపగలే దోపిడీ చేస్తున్నారు. మొరపెట్టుకున్నా వినేవాడెవడూ లేడు. పల్లెటూళ్ళ సంపదంతా లక్నో నగరానికి ఓడ్చుకు రాబడుతోంది. అదంతా వేశ్యాగృహాలకూ, సారాకుండలకూ, తదితర భోగ విలాసాలకూ ఆహుతైపోతూంది. ఈస్టిండియా కంపెనీవాళ్ళ రుణం రోజురోజుకూ పెరిగిపోతోంది. అంతకంతకు అప్పు కంబడి తడిసి ముప్పందుమౌతోంది. రాజ్యంలో సుపరిపాలన లేనందువల్ల పన్నులుకూడా వసూలు కావటం లేదు. మరోప్రక్క కంపెనీ రెసిడెంటు మాటిమాటికీ హెచ్చరికలు చేస్తున్నాడు. కాని యిక్కడ అందరూ విలాసాలకైపులో మునిగి తేలుతున్నారు. ఎవడికీ చీమ కుట్టినట్టయినా లేదు.

సరే! ఇక్కడ మీర్‌సాహెబ్ దివాణంలో చదరంగ మాడటం ప్రారంభించి నెలలు గడిచినాయి. చదరంగంలో కొత్త కొత్త స్కీములు వేసేవాళ్ళు. కొత్త కొత్త కోటలు నిర్మించేవాళ్లు. నిత్యం సరికొత్త వ్యూహాలు కనిపెట్టేవాళ్ళు. అప్పుడప్పుడు ఆటమధ్యలో పేచీ పడేవాళ్ళు. నువ్వెంతంటే నువ్వెంత అనేవరకూ వచ్చేది పరిస్థితి.

కాని వెంటనే మిత్రులిద్దరూ కలిసిపొయ్యేవాళ్లు. అప్పుడప్పుడు ఆట అసలు ఎత్తిపారేయటంగూడా జరిగేది. మీర్జా అలిగి తన యింటికి వెళ్ళిపోయేవాడు. మీర్‌సాహెబ్ తన యింట్లోకి పోయి కూర్చునేవాడు. కాని రాత్రి నిద్రలో వాళ్ళ మనస్పర్ధంతా మటుమాయమై పోయేది. తెల్లవారగానే మిత్రులిద్దరూ మళ్ళీ దివాణంలో తయారయ్యేవాళ్ళు.

ఒకరోజున వారిద్దరూ చదరంగపు ఊబిలో గొంతులోతున దిగబడి ఉక్కిరిబిక్కి రౌతున్నారు. ఇంతలో గుర్రమెక్కి చక్రవర్తి సైనికాధికారి ఒకడు "మీర్‌సాహెబ్ ఎక్కడ?" అంటూ వచ్చాడు. మీర్‌సాహెబ్ ప్రాణాలు ఎగిరిపోయినాయి. "ఇదొక పీడ వచ్చి పడిందే. ఎందుకొచ్చిందబ్బా ఈ పిలుపూ? ఏదో కొంపమునిగినట్లే ఉందే!" ఇంటి తలుపు బిగించాడు. "ఇంట్లో లేరని చెప్పు" అన్నాడు నౌకర్లతో. "ఇంట్లో లేక ఎక్కడికి వెళ్ళాడు? అన్నాడు అధికారి. "ఏమో తెలియదు; ఏమిటి పనీ?"

"నీకు చెబితే ఏం లాభం? చక్రవర్తిగారు కబురంపారు. బహుశా సైన్యానికి సిపాయిలు కావాలేమో! జాగీర్దారనుకున్నాడా, మజాకా అనుకున్నాడా?"

"అయితే వెళ్ళండి. చెబుతాను లెండి."

"ఇది చెప్పేమాట కాదు. రేపు మళ్ళీ నేను వస్తాను; వెంబడి తీసుకురమ్మని హుకుమైంది."

అధికారి వెళ్ళిపోయినాడు. మీర్‌సాహెబ్ గుండె దడదడలాడిపోయింది. "చెప్పండి! ఇక ముందు గతేమిటి?" అన్నాడు మీర్జాతో.

"పెద్దచిక్కే వచ్చింది. ఒకవేళ నాకూ వస్తుందేమో పిలుపు."

"దరిద్రుడు! మళ్ళా రేపే వస్తానని చెప్పాడే!"

"ఇంకేముంది? ఏదో కొంప మునిగింది. ఒకవేళ యుద్ధానికి వెళ్ళవలసివస్తే చచ్చామన్నమాటే!"

"ఇదుగో! ఒక్కటే ఉపాయముంది. అసలు యింటి దగ్గర లేకుండా ముఖం తప్పిస్తేసరి. రేపటినుండీ గోమతీనది ఒడ్డున ఉన్న

అడవిలో వేద్దాం బిఛాణా. అక్కడ ఉన్న సంగతి ఎవరికి తెలుసూ? ఆ హాజరత్ వస్తే వచ్చిన దోవనే వెళ్తాడు."

"శబాష్! బలే ఉపాయం తట్టింది. ఇంతకంటె మరో దారి లేదు."

ఇవతల మీర్‌సాహెబ్ భార్య ఆ అధికారితో "మీరు బలే బెదురు పెట్టారే," అంటోంది. "ఇటువంటి మూర్ఖులను చిటికలమీద తైతక్కలాడిస్తాను. ఈయన తెలివితేటలూ, ధైర్య సాహసాలూ చదరంగం మింగేసింది. ఇక పొరపాటునగూడా యింట్లో ఉండరల్లే ఉంది!" అంటూ వెళ్ళిపోయినాడా అధికారి.

# 3

మరుసటిరోజు నుండి మిత్రు లిద్దరూ కనుచీక టుండగానే యింటినుండి జారుకునేవాళ్ళు. చిన్న జంపఖానా ఒకటి చంకలో పెట్టుకుని, ఒక డబ్బానిండా తాంబూలసామగ్రి కుక్కి గోమతీనది దాటి పోయేవాళ్ళు. ఒక పురాతనమైన పాడుబడిన మసీదులోకి వెళ్ళేవాళ్లు. బహుశా అ మసీదు కట్టించింది అసఫుద్దౌలా కావచ్చు. పొగాకు, గంజాయి, బ్రాందీ వగైరా దోవలోనే సమకూర్చుకునే వాళ్ళు. ఇక మసీదుకు చేరుకుని, జంపఖానా పరిచి, హుక్కా తయారుచేసుకుని చదరంగం ప్రారంభించేవాళ్ళు. ఇక వాళ్ళకు ఈ లోకపు ఊసే పట్టేదికాదు. "కిస్త్, షహా" యిలాంటి ఒకటి రెండు మాటలు మినహా మరో మాట ఉచ్చరించేవాళ్ళే కాదు. మహా యోగి అయినవాడుకూడా తపస్సులో యింత తన్మయం కావటం జరగదేమో. రెండు ఝాములైన తరువాత ఆకలైనట్టు తోస్తే, మిత్రు లిద్దరూ ఏ రొట్టెల దుకాణానికో వెళ్ళి నాస్తాచేసి వచ్చేవాళ్ళు. ఒక్కపట్టు హుక్కాత్రాగి తిరిగి యుద్ధరంగంలో నిలబడేవాళ్ళు. ఒకొక్కప్పుడు వాళ్ళు భోజనంసంగతిగూడా మరిచిపోయేవాళ్ళు.

మరో ప్రక్క దేశంలో రాజకీయ పరిస్థితులు భయంకరంగా విష మించిపోతున్నాయి. కంపెనీ సైన్యాలు లక్నోవైపుకు సాగివస్తున్నాయి. నగరంలో చాలా ఆందోళనగా ఉంది. ప్రజలు తమ పిల్లాజెల్లలతో సహా పల్లెటూళ్ళకు పారిపోతున్నారు. కాని, మన యోధు లిద్దరికీ మాత్రం చీమకుట్టినట్టయినా లేదు. వాళ్ళు యింటినుండి బయలుదేరితే గొందులగుండా వచ్చేవాళ్ళు. ఎక్కడ ఏ చక్రవర్తి ఉద్యోగి కంటబడతాడో, వెట్టిచాకిరీ కెక్కడ లాక్కుపోతాడోనని భయమాయె మరి! వేలరూపాయల ఆదాయం వచ్చే జాగీరును ఉత్తినే అనుభవిద్దామని వాళ్ళ అభిప్రాయం.

ఒకరోజున మిత్రులిద్దరూ ఆ శిథిలమైన మసీదులో కూర్చు నిచదరంగం ఆడుతున్నారు మిర్జా ఆట కాస్త వెనుకడుగులో ఉంది. మీర్ సాహెబ్ ఆయన్ను దెబ్బమీద దెబ్బతీస్తున్నాడు. ఇంతలో కంపెనీ సైనికులు రావటం చూచారు. అది తెల్లవాళ్ళ సైన్యం. లక్నోను ఆక్రమించుకోటానికి వస్తోంది.

"ఇంగ్లీషువాళ్ళ సైన్యంవచ్చేస్తోంది. అల్లా రక్షించాలి!" అన్నాడు మీర్‌సాహెబ్.

"రానిద్దురూ! ముందు దెబ్బకాచుకోండి. ఇదిగో కిస్త్!"

"కాస్త అటు చూద్దాం. ఇక్కడే చాటుగా నుంచుందాం."

"చూద్దాంలెండి! తొందరేమిటి? ఇదిగో మళ్ళీ – కిస్త్!"

"ఫిరంగిదళంకూడా ఉంది. షుమారు అయిదువేల మంది ఉంటారు. ఎంత కుర్రవాళ్ళు! ఎర్ర కోతుల్లాగా ఉన్నారే! వాళ్ళను చూస్తేనే గుండె బేజారెత్తిపోతుంటే!"

"జనాబ్! తప్పించుకు పోదామనా మీ ఎత్తు? ఈ టక్కులన్నీ మన దగ్గర కాదండోయ్! ఇదిగో కిస్త్!"

"మీరు బలే విచిత్రమైన మనుషులండీ! అటు ఒకప్రక్క పట్టణానికి ప్రమాదం వచ్చిపడితే మీరు కిస్తుల్లో మునిగి తేలుతున్నారా? పట్టణం చుట్టుముట్టుబడితే ఇంటి కెలా వెళ్తామో అనైనా ఆలోచించారా?"

"ఇంటికి వెళ్ళేటప్పుడే ఆలోచిద్దాంగానీ – ఇదిగో కిస్త్! ఈసారి 'షహ్' అన్నానంటే బిస్మిల్లా!"

సైన్యం వెళ్ళిపోయింది. పది గంటలైంది. మళ్ళీ ఆట ప్రారంభించారు.

'ఇవ్వాళ తిండిసంగతి ఏం చేద్దాం మరి?' అన్నాడు మీర్జా.

'ఇవ్వాళ ఉపవాసమనుకుందాంలే! మీకు మరీ ఆకలిగా ఉందా ఏం?' అన్నాడు మీర్.

'లేదులెండి. కాని పట్టణంలో ఏం జరుగుతున్నదో మరి!'

'పట్టణంలో ఏమీ జరుగుతూఉండదు. ప్రజలు సుష్టుగా భోంచేసుకుని హాయిగా నిద్రపోతుంటారు. నవాబుగారుకూడా ఖుషీలోనే ఉండి ఉంటారు.'

ఆ సత్పురుషు లిద్దరూ తిరిగి ఆట ప్రారంభించేసరికి మూడు గంటలైంది. ఈసారి మీర్జాసాహెబ్ ఆట వెనుకడుగులో ఉంది. నాలుగైనట్లుగా గంట లింకా కొడుతుండగానే సైన్యం వెనుదిరిగి వస్తున్న అలికి డయింది. నవాబ్ వజీద్ అలీ సాహెబ్ బట్టుబడ్డాడు. సైన్యం ఆయన్ను ఎక్కడికో అజ్ఞాత ప్రదేశానికి తీసుకువెళ్తోంది. పట్నంలో ఆందోళన ఏ మాత్రం కనపడలేదు. ఘర్షణలేమీ జరగలేదు. ఒక్క నెత్తురుబొట్టయినా చిందలేదు. ఇంతవరకు ఏ స్వతంత్ర దేశపు రాజూ ఇంత ప్రశాంతంగా ఒక్క నెత్తురుబొట్టయినా చిందించకుండా ఓడిపోవటం ఎన్నడూ జరిగుండదు. దేవతలు ప్రసన్నులయ్యే అహింసా ప్రదర్శనం కా దిది. నీచాతి నీచమైన పిరికి పందలు సైతం కన్నీరు కార్చే ఘటు నిది. అయోధ్యలాంటి విశాల దేశపు నవాబును ఖైదీగా బంధించి తీసుకువెళ్తుంటే, లక్నో నగరం విలాసాల కైపులో మత్తెక్కి ఉంది. దేశపు రాజకీయ పతనావస్థకు పరాకాష్ట ఈ ఘటన.

'చూచారా సాహబ్! నవాబుగారిని దుర్మార్గులు ఖైదు చేసేశారు!' అన్నాడు మీర్జా.

'చేశారు కాబోలులెండి. ఇదిగో 'షహ' చెప్పాను చూడండి!' అన్నాడు మీర్‌సాహెబ్.

'కాసేపు ఆగండి. ఇప్పుడు మనసు యిక్కడ నిలవడంలేదు. నవాబు గారిప్పుడు గోడుగోడున ఏడుస్తూంటాడు పాపం!'

"ఏడవదు మరి! ఈ భోగవిలాసాలు అక్కడ అమరవుగా పాపం! సరే ఇదిగో! కిస్!"

"ఎవరికైనా రోజులన్నీ ఒక్కతీరుగా ఉండవుగదా! ఎంత హీనస్థితి ముంచుకొచ్చింది!"

"ఔనౌను. ఆమాట నిజమే ననుకొండి. యిదిగో మళ్ళీకిస్! బస్! ఈసారి ఎత్తుతో ఖాళీ. ఇంక తప్పించుకోలేరు"

"అల్లా సాక్షిగా చెబుతున్నా. మీరు వట్టి కటికవాళ్ళండీ. ఇంత పెద్ద ఆపదసమయంలోకూడా మీకు విచారం కలగకుంలేదు. పాపం వాజీదాలీ చక్రవర్తి ఎంత దురదృష్టవంతుడండీ!"

"ముందు మీ చక్రవర్తిని కాపాడుకోండి. నవాబ్ సాహెబ్ గారిని తరువాత ఊరడించవచ్చులెండి! ఇదిగో 'షహ'! ఆటకట్టింది. ఓడిపోయినారు మీరు. చెయ్యిలా అందివ్వండి!"

చక్రవర్తిని తీసుకుని సైన్యం వారి ముందుగానే సాగిపోయింది. సైన్యం వెళ్ళగానే మిర్జా తిరిగి పావులు పరిచాడు. ఓటమి కలిగించిన గాయం లోతైంది. "నవాబు సాహెబ్‌నుగురించి ఒక మర్సియా (శోకగీతం) పాడదాంక రండి" అన్నాడు మీర్. కాని మిర్జా సాహెబ్ రాజభక్తి తన ఓటమితోపాటే అంతరించిపోయింది. తన పరాజయానికి ప్రతీకారంకోసం తహతహలాడిపోతున్నా డాయన.

# 4

సాయంత్రమైంది. ఆ శిథిలమైన మసీదులో గబ్బిలాలు కీచు కీచు మంటున్నాయి. కృష్ణపక్షులు వచ్చి తమ గూళ్ళకు చేరుకుంటు న్నాయి. కాని మన యోధు లిద్దరూ రక్తదాహంతో తహ తహలాడి పోతూ పరస్పరం కత్తులు దూసుకున్న యుద్ధవీరుల్లాగా సిద్ధంగా నిల బడారు. మీరాసాహెబ్ వరుసగా మూడు ఆటలూ ఓడిపోయినాడు. ఈ నాలుగో ఆట నడకకూడా ఏ మంత బాగాలేదు. ఆయన మాటి

మాటికీ ఆట గెలుచుకుందామనేగట్టి పట్టుదలతో నే ఆచితూచి మరీఆడుతున్నాడు. అయినా ఏదో ఒక తప్పుడు ఎత్తు పడిపోయి ఆటంతా నాశనమైపోయేది. ప్రతిసారీ ఓటమితోపాటు ప్రతీకారభావంకూడా మరింతగా చెలరేగేది. ఇక మీర్ సాహెబ్ హుషారుగా పదాలు పాడటం, చిటికెలు వేయటం జోరుగా సాగిస్తున్నాడు. ఏదో దాచిన ముల్లె దొరికినట్లుగా ఉంది అయనపని. మీర్జా సాహెబ్ విని విని విసుక్కునేవాడు. తన పరాజయ పరాభవాన్ని దాచుకోటానికి ఆయన్ను ప్రశంసించేవాడుకూడా. కాని, ఆట పాడైపోయేకొద్దీ, సహనం కాస్తా మటుమాయమైపోతోంది. చివరకు ప్రతి చిన్నవిషయానికీ చిరచిర లాడటం మొదలుపెట్టాడు! "ఏమండోయ్! మీరు ఎత్తు మార్చబోకండి. అదేమిటి? ఒక ఎత్తువెయ్యటం, తిరిగి దాన్ని మార్చివేయటమూ - ఏమి టీ ఆట? వెయ్యదలచుకున్న ఎత్తేదో ఒక్కసారే వెసెయ్యండి. మీ రలా పావుమీదనే ఉంచుతా రేమిటి చెయ్యి? పావుమీద చెయ్యి తీసివెయ్యండి. మీకు ఎత్తు తోచే వరకూ పావుమీద చెయ్యి వెయ్యకండి. ఒక్కొక్కఎత్తు వెయ్యటానికి అరగంటా? అలా వీల్లేదు తెలుసా? ఎవరైనాసరే ఒక్క ఎత్తుకు అయిదు నిమిషాలకు మించి ఆలస్యంచేస్తే ఓడిపోయినట్లే లెక్క. అదుగో! మీరు మళ్లీ ఎత్తు మార్చారు. మెదలకుండా ఉన్నచోట పెట్టేసెయ్యండి పావు."

మీర్‌సాహెబ్ మంత్రి ప్రమాదంలో ఉన్నాడప్పుడు.

"నే నసలు ఎత్తువేసిం దెక్కడ?" అన్నాడు మీర్.

"మీ రెప్పుడో వేశారు ఎత్తు. పావు అక్కడే ఉంచండి. ఆ గడినుంచి కదపకండి!" అన్నాడు మీర్జా.

"ఆ గడిలో ఎందుకుంచుతానూ? నే నసలు పావుమీదినుంచి చెయ్యి తీస్తేగా?"

"మీరు స్వర్గానికి వెళ్లిందాకా పావు వదలకపోతే ఎత్తు వెయ్యనట్లేనా ఏమిటి? మంత్రికి తిప్ప లొచ్చేసరికి మోసానికి తయారౌతారా?"

"మోసం చేసేది మీరూ! ఓడటం, గెలవటం అదంతా అదృష్టం. మోసంతో ఎవడూ గెలవలేడు."

"అయితే ఈ ఆట మీరు ఓడిపోయినట్లేనా?"

"నే నెందు కోడతాను?"

"అయితే ఆ పావు మొదట ఉన్న గడిలోనే ఉంచండి మరి."

"అక్కడ ఎందుకుంచుతానూ? ఉంచను."

"ఎందు కుంచరేం? ఉంచి తీరాల్సిందే."

వివాదం పెరగసాగింది. ఇద్దరూ వాళ్ళవాళ్ళ పట్టుమీద మొండికేశారు. ఎవరూ తగ్గటం లేదు. అసందర్భమైన మాటలు ప్రారంభమైనాయి. "వంశంలో ఎవడైనా చదరంగం ఆడినవా డుంటేగా ఆటపద్ధతులు తెలిసేందుకూ? అంతా గడ్డి కోసుకునేరకమాయిరి మరి! మీకేం చేతౌతుంది చదరంగం? సంస్థానం అంటే దాని తరహా అంతా వేరు. జాగీరు దొరికినంతమాత్రానే గొప్పవాళ్ళవుతారా!" అన్నాడు మీర్జా.

"ఏమన్నావ్!! మీ బాబు కోసుకునే వాడేమో గడ్డి ... మా వంశం తరతరాలనుంచీ చదరంగం ఆడే వంశమే," అన్నాడు మీర్.

"ఇక ఆపుదురూ! గాజీవుద్దీన్ హైదర్ దగ్గర వంటపని చేసి చేసి వయసంతా కుంగిపోయింది! ఇవ్వాళ పెద్ద గొప్పవాణ్ణంటూ బయలుదేరారు! గొప్పవాడు కావటం అంటే మజాకా కాదు తెలుసా?"

"ఎందుకు మీ పెద్దల బ్రతుకలా బజారున కీడ్చుకోవటం? వంటపని చేసింది మీవాళ్ళే కాబోలు మరి! మావాళ్లు ఎప్పుడూ చక్రవర్తి సరసన కూర్చుని భోంచేసినవాళ్లు. తెలుసా?"

"ఇక ఆపవోయ్ బడాయిపిందె! పెద్ద డబ్బాలాగావాగబోకు."

"ఒళ్లు దగ్గర ఉంచుకొని మాట్లాడండి. లేకపోతే మర్యాద దక్కదు. ఇలాంటి మాటలుపడే అలవాటు లేదు నాకు. నా ముందు ఎవరైనా కళ్ళు ఎర్రజేయడం జరిగితే వాళ్ళ గుడ్లు తోడించేస్తాను. దమ్ములున్నాయా మరి?"

"నాకు దమ్ములున్నాయో లేదో చూడాలనుందా? అయితే రండి. యుద్ధం చేద్దాం. అటోయిటో తేలిపోవాలివ్వాళ."

"నీకు తగ్గేవాళ్ళెవరిక్కడ?"

మిత్రులిద్దరూ ఒరల్లోనుండి కత్తులు దూశారు. నవాబులు ఏలే కాలమది. అందరూ కత్తులూ, బాకులూ, కటారులూ వగైరా ధరించే వాళ్ళు. ఇద్దరూ విలాసపురుషులే. కాని పిరికిపందలు మాత్రం కాదు. రాజకీయ భావాల్లోమాత్రం పతనమైపోయారు వాళ్ళు. రాజ్యంకోసం ఎందుకు ప్రాణాలిస్తారు? కాని వ్యక్తిగతమైన పౌరుషానికేమీ లోటులేదు. ఇద్దరూ అడుగులు వేసుకుంటూ యుద్ధానికి సిద్ధమైనారు. కత్తులు మెరిసినాయి. ఖణ్ ఖణ్ మని ధ్వనులు వినబడుతున్నాయి. ఇద్దరూ గాయపడి పడిపోయినారు. కొట్టుకులాడి కొట్టుకులాడి అక్కడే ప్రాణాలు విడిచారు. తమ చక్రవర్తికోసం ఒక్క కన్నీటిబొట్టయినా కార్చనివాళ్ళు చదరంగంలో మంత్రి రక్షణకోసం ప్రాణాలిచ్చేశారు.

చీకటి పడిపోయింది. ఆట పరిచేఉంది. చక్రవర్తులిద్దరూ ఈ వీరులిద్దరి మరణానికి విలపిస్తున్నారా అన్నట్లు, తమ సింహాసనాల మీద ఆసీనులై వున్నారు.

నలువైపులా నిశ్శబ్దం ఆవరించింది. ఆ శిథిలమైన మసీదుతాలూకు విరిగిపోయిన వసారాలూ, పడిపోయిన గోడలూ, దుమ్ముతో నిండిన స్తంభాలూ ఈ శవాలను చూస్తూ పశ్చాత్తాప పడసాగినాయి.

# పోటా పోటీ

జోఖూ భగత్‌కూ, బేచన్ చౌధరీకీ మూడు తరాలనుండీ శత్రుత్వం. పొలంగట్లుదగ్గర కాస్త పేచీ వచ్చింది. దాని విషయంలో వాళ్ళ తాతలు అనేకసార్లు ఘర్షణపడ్డారు. తండ్రుల కాలంనుండీ దావాలు ప్రారంభమైనాయి. ఇద్దరూ అనేకసార్లు హైకోర్టువరకూ వెళ్ళారు. కుమారుల హయాంలో తగాదా యింకా తీవ్రమైంది. చివరకిద్దరూ దివాలా తీసేవరకూ సాగింది. మొదట యిద్దరూ గ్రామంలోని మొత్తం ఆస్తికి చెరిసగం భాగస్తులు. ఇప్పుడు వారికి ఆ తగాదాలో ఉన్న భూమి మినహాయించితే ఒక్క అంగుళం భూమికూడా లేదు. భూమిపోయింది; ధనం పోయింది; మాన మర్యాదలు పోయినాయి; కాని ఆ తగాదామాత్రం ఎప్పటిలాగానే ఉంది. హైకోర్టులోని హేమా హేమీలైన న్యాయవేత్తలంతా కలిసి ఒక చిన్న సాధారణమైన తగాదాను పరిష్కరించలేకపోయారు.

ఈ సత్పురుషులిద్దరూ గ్రామాన్ని రెండు శత్రుకూటములుగా విభజించారు. ఒక ముఠా చౌధరీ యింటిదగ్గరచేరి సారా త్రాగటం మొదలెడితే, మరోముఠా భగత్ యింటివద్దచేరి గంజాయిదమ్ము వేసు

కునేవాళ్ళు. స్త్రీలు, పిల్లల్లోకూడా రెండు ముఠాలై పోయినాయి. చివరకు ఆ సత్పురుషుల సాంఘిక, మతవిశ్వాసాల్లోకూడా అడ్డుగోడలు తయారైనాయి. చౌధరీ కట్టుకున్న గుడ్డలతోనే భోజనం చేసేవాడు. భగత్‌ని వట్టి మోసగాడనేవాడు. భగత్ మడి గట్టుకోకుండా మంచి నీళ్ళయినా ముట్టేవాడుకాదు. చౌధరీని వట్టి భ్రష్టుడనేవాడు. భగత్ సనాతన మతస్థుడైతే చౌధరీ ఆర్యసమాజీకుడైనాడు. చౌధరీ ఖరీదుచేసే బట్టలషాపువంకగాని, చిల్లరదుకాణంవంకగాని, కూరగాయల కొట్టు వైపుగాని కన్నెత్తి చూడటంకూడా మహా పాతక మనుకునేవాడు. భగత్ ఖరీదుచేసే మిఠాయి కొట్లో మిఠాయీలు గాని, ఆయనకు పాలుపోసే గొల్లవాడి పాలుగాని, నూనెకొట్లో నూనెగాని చౌధరీ గారికి ముట్టరాని వస్తువులు. చివరకు వాళ్ళ ఆరోగ్య సిద్ధాంతాల్లో కూడా వైరుధ్యమే. భగత్‌జీ ఆయుర్వేద వైద్య సమర్థకుడైతే, చౌధరీ యూనాని వైద్య పద్ధతిని మెచ్చుకునేవాడు. ఇద్దరూకూడా తమ ప్రాణాలు పోవటానికైనా ఒప్పుకుంటారుగాని తమ సిద్ధాంతాలను మాత్రం వదులుకోరు.

## 2

దేశంలో ప్రారంభమైన రాజకీయాందోళన గాలి ఆ గ్రామానికి కూడా సోకింది. చౌధరీ ఉద్యమాన్ని సమర్థించాడు. భగత్ వ్యతిరేకించాడు. ఒక మహనీయుడు వచ్చి గ్రామంలో రైతు సంఘం స్థాపించాడు. చౌధరీ అందులో చేరాడు. భగత్ దూరంగా ఉండి పోయాడు. ప్రజల్లో చైతన్యం హెచ్చింది. స్వరాజ్యాన్ని గురించి చర్చలు తీవ్రంగా జరుగుతున్నాయి. చౌధరీ స్వరాజ్య వాదైనాడు. భగత్ రాజభక్తుడయినాడు. చౌధరీ యిల్లు స్వరాజ్య వాదుల వసతి గృహమైతే భగత్ భవనం రాజభక్తిపరాయణుల క్లబ్ అయింది.

చౌధరీ ప్రజల్లో స్వరాజ్యవాద ప్రచారం సాగించాడు. "మిత్రులారా! స్వరాజ్యమంటే మనరాజ్య మన్నమాట. మన దేశంలో మన రాజ్యం ఉంటే మంచిదా పరాయివాళ్ళ రాజ్యముంటే మంచిదా? చెప్పండి."

"మన రాజ్యం ఉంటేనే బాగుంటుంది!" అన్నారు ప్రజలు.

"అయితే మన రాజ్యం ఎలా వస్తుంది? ఆత్మశక్తితో వస్తుంది. పురుషప్రయత్నంతో వస్తుంది. ఐకమత్యంతో వస్తుంది. ఒకరి నొకరు ద్వేషించడం మానుకుని, మన తగాదాలను మనమే కలిసి పరిష్కరించుకుంటే అప్పుడు వస్తుంది మన రాజ్యం!" అన్నాడు చౌధరీ.

"మీరు నిత్యం కోర్టుచుట్టూనే తిరుగు తుంటారుగా!" ప్రశ్నించిందొకకంఠం.

"నిజమే. కాని, ఈ రోజునుంచీ నేను కోర్టు గడప తొక్కితే గోహత్యాపాతకాని కొడిగట్టినట్లే. మీరు మీ కష్టార్జితాన్ని మీ పెళ్ళాం బిడ్డలకోసం ఖర్చు పెట్టుకోండి. ఇంకా అదనంగా మిగిలితే పరోపకారానికి వినియోగించండి. అంతేగాని ప్లీడర్ల జేబులు నింపడం ఎందుకు చెప్పండి. సబ్‌యిన్‌స్పెక్టర్లకు లంచాలెందు కివ్వాలో ఆలోచించండి. అధికారులచుట్టూ చేతులు నలుపుకుంటూ తిరగడం దేనికి చెప్పండి! పూర్వం మన పిల్లలు మన మతసంబంధమైన విద్య నేర్చుకునే వాళ్లు. అందువల్ల వాళ్ళు బుద్ధిమంతులుగానూ, పౌరుష వంతులుగానూ ఉండేవాళ్ళు. ఇప్పుడు వీళ్ళు విదేశీ పాఠశాలల్లో చదివి ఉద్యోగాలు చేస్తున్నారు. లంచాలు తింటున్నారు. పైలా పచ్చీసుగా సంచరిస్తున్నారు. మన దేవతలనూ, పూర్వులనూ నిందిస్తున్నారు. సిగరెట్లు తాగుతున్నారు. క్రాపులు చేయించుకుంటున్నారు. అధి కారులకు కాకా బడుతూ తిరుగుతున్నారు. మనం మన పిల్లలకు మన మత ధర్మాన్ననుసరించి విద్య నేర్పడం మన కర్తవ్యం కాదా?" అన్నాడు చౌధరీ.

"చందా వేసుకుని పాఠశాల ప్రారంభించాలి," అన్నారు ప్రజలు.

"పూర్వం మనం కల్లు త్రాగడం పాపమనుకునే వాళ్ళం. యిప్పుడు గ్రామగ్రామానా వీధివీధినా కల్లు దుకాణాలే. మనం కోట్ల రూపాయల కష్టార్జితాన్ని ఈ గంజాయికీ, కల్లుకూ కొల్ల బెట్టేస్తున్నాం," అన్నాడు చౌధరీ.

"కల్లూ, గంజాయి త్రాగినవాళ్ళకు జరిమానా వెయ్యాలి." అన్నారు ప్రజలు.

"మన తండ్రులూ, తాతలూ, పెద్దాచిన్నా అందరూ ముతక బట్ట కట్టేవాళ్ళు. మన అమ్మమ్మలూ, నాయనమ్మలూ రాటం వడికే వాళ్ళు. డబ్బంతా మన దేశంలోనే ఉండేది. మన చేనేత సోదరులు సుఖంగా కాలంగడిపేవాళ్ళు. ఇప్పుడు మనం విదేశాల్లో తయారైన సన్నని రంగురంగుల బట్టలంటే పడిచస్తున్నాం. ఈ విధంగా పరాయి దేశస్థులు మన సంపదను కొల్లగొట్టుకు పోతున్నారు. పాపం చేనేతవాళ్ళు బిచ్చగాళ్ళయి పోయారు. మన సోదరుల ముందున్న విస్తరి తీసి పరాయివాళ్ళ కందించటం ధర్మమేనా ?" అన్నాడుచౌధరీ.

"ముతక బట్ట ఎక్కడా దొరక్కనే పోతేనో ?" అన్నారు ప్రజలు.

మీ యిళ్ళల్లో తయారైన ముతకబట్ట కట్టండి. కోర్టులను బహిష్కరించండి. మత్తుపదార్థాలు మానివెయ్యండి. మీపిల్లలకు మన మతకర్మలునేర్పండి. కలిసి మెలిసి ఉండండి. ఇంకేముందీ ? స్వరాజ్యమంటే యిదే! స్వరాజ్యం కోసం నెత్తురు నదులై పారాలని చెప్పేవాళ్ళు వట్టి వెర్రివాళ్లు. వాళ్ళమాటలేవీ లక్ష్యపెట్టబోకండి." అన్నాడు చౌధరీ.

ప్రజలీ మాటలు మహాశ్రద్ధగా ఆలకించేవాళ్ళు. క్రమక్రమంగా శ్రోతల సంఖ్య హెచ్చవటం మొదలైంది. చౌధరీ అందరి గౌరవాన్నీ చూరగొన్నాడు.

# 3

భగత్ గూడా రాజభక్తిని గురించి ఉపదేశించటం మొదలెట్టాడు.

"సోదరులారా! రాజ్యాన్ని పరిపాలించటం రాజకర్తవ్యం. ఆయన ఆజ్ఞలను పాటించటం ప్రజల ధర్మం. దీన్నే 'రాజభక్తి' అంటారు. మన మతగ్రంథాల్లో మనకు బోధించే దీ రాజభక్తిని గురించే. రాజంటే ఎవరు? భగవంతుని తరపున ప్రతినిధి. ఆయన ఆజ్ఞలకు విరుద్ధంగా నడుచుకోటం మహాపాతకం. రాజుకు వ్యతిరేకి అయినవాడు నరకానికి పాత్రుడౌతాడు." అన్నాడు భగత్.

రాజుకూడా తన ధర్మాన్ని పాలించాలిగా!" అన్న దొక గొంతు.

"మన రాజు పేరుకు మాత్రమే రాజు. అసలు రాజులు విదేశ షావుకార్లూ, జమీందార్లేగా!" అన్నది మరోగొంతు.

"షావుకార్లకు డబ్బుసంపాదించటం తెలుస్తుంది గాని రాజ్యం చెయ్యటం ఏం చేతౌతుందీ?" అన్నది యింకో గొంతు.

"కొందరు మిమ్మల్ని కోర్టులను బహిష్కరించండని ఉపదేశిస్తున్నారు. పేచీలన్నీ పంచాయతీలద్వారా పరిష్కరించుకోండి అంటున్నారు. నీళ్ళకు నీళ్ళూ, పాలకు పాలూ విడదీసి నిక్కచ్చిగా న్యాయం చెప్పగల పెద్దమనుష్యులు ఎక్కడున్నారు, చెప్పండి? ఇక్కడంతా మొగమాటపు వ్యవహారం జరుగుతూంది. నోరుగలవాడు గెలుస్తాడు. నోరులేని వాణ్ణి అణగద్రొక్కేస్తారు. కోర్టుల్లో అయితే వ్యవహారమంతా చట్టప్రకారం జరుగుతుంది. అక్కడ పెద్దా, చిన్నా అందరూ సమానమే. సింహాలూ మేకలూ ఒక్క రేవులో నీళ్ళు త్రాగుతాయక్కడ. ఇటువంటి కోర్టులను బహిష్కరించటం అంటే మనగొయ్యి మనం తీసుకోటమే."

"కోర్టులకు వెళ్ళటానికి డబ్బు సంచు లెక్కడ తేగలం?" ప్రశ్నించిందొక గొంతు.

"కోర్టుల్లో న్యాయం పేరుకు మాత్రమే. కూట సాక్ష్యాలూ, జిత్తులమారి వకీళ్ళూ ఎవరివైపున ఉంటే వాళ్ళే జయిస్తారు. లేనిపోని హైరాన పడటం తప్పితే న్యాయాన్యాయాలు విచారించే దేవ రక్కడ?" అన్నది మరోగొంతు.

"విదేశ వస్తువులు వాడవద్దు అంటారు. ఇందువల్ల పేదవాళ్ళకు ఘోరమైన అన్యాయం జరుగుతుంది. మనకు బజారులో ఏ వస్తువు శ్రేష్ఠమైందీ చౌకగానూ దొరుకుతుందో అదే కొనుక్కొంటాం. స్వదేశీ దైతేనేం? విదేశీదైతేనేం? పనికిమాలిన స్వదేశీవస్తువుల కోసం డబ్బు తగలెయ్యటానికి మనకేమైనా తేరగా వస్తున్నదా డబ్బా?" అన్నాడు భగత్.

"మన డబ్బు మన దేశంలోనే ఉంటుందిగా! పరాయివాళ్ల జేబుల్లోకి పోదుగా!" అన్నదొక గొంతు.

"మనయింట్లో మంచి భోజనం దొరకకపోతే మంచి భోజనం దొరుకుతుందని పరాయిజాతి వాళ్ళింటికి వెళతామా?" ప్రశ్నించింది మరో గొంతు.

"పిల్లలను సరా రు పాఠశాలల్లో చదివించ వద్దంటున్నారు కొందరు. సర్కారు పాఠశాలల్లో చదవకపోతే ఈరోజున మనవాళ్ళకు పెద్ద పెద ఉద్యోగా లెలా వచ్చేవి? పెద్ద పెద్ద ఫ్యాక్టరీలు ఎలా నడపగలిగేవాళ్ళు? ఈ నూతనవిద్య చదవకుండా ఇప్పటి ప్రపంచంలో జీవితం సాగించటం సాధ్యం కాదు. పాతకాలపు చదువులవల్ల పంచాంగం చూడటం, పురాణాలు చెప్పటం — ఇవి తప్పితే ఇంకేం చేతనౌతుంది? ఈ పుస్తకాలు చదివేవాళ్లేనా రాచకార్యాలు నిర్వహించేది?" అన్నాడు భగత్.

"రాచకార్యాలు మాకే మక్కరలేదు! మాకు మా వ్యవసాయమే చాలు. ఇందువల్ల ఎవరికీ బానిసలు కాముగా?" అన్న దొక గొంతు.

"గర్వపోతులుగా తయారుచేసే విద్య కంటె మూర్ఖుడుగా ఉండటమే ఉత్తమం. ఈ కొత్త చదువులు చదివి, సూటూ బూటూ,

బెత్తం, రిస్టువాచీ, హేటూ, కోటూ ఇవ్వన్నీ తగిలించటం మొదలెట్టారు, తమజల్సాకోసం దేశంలో డబ్బంతా విదేశస్తులకు కొల్లబెడుతున్నారు. వీళ్లు దేశద్రోహులు!' అన్నది మరో గొంతు.

'గంజాయీ, సారాలంటే ప్రస్తుతం జనానికి మహా ఏవగింపుగా ఉంది. మత్తు పదార్థాలను సేవించటం దుర్వ్యసనమేనని అందరకూ తెలిసిందే ప్రభుత్వానికి మత్తుపదార్థాల దుకాణాల వల్ల కోట్ల రూపాయల ఆదాయం వస్తోంది. దుకాణాల్లోకి వెళ్ళటం మానివేసి యీ దుర్వ్యసనం వదిలిపోతే చాలా మంచిదే. కాని అందుకు అలవాటు పడిన వాడి వ్యసనం ఎక్కడ ఆగుతుందీ? దుకాణానికి వెళ్ళకపోతే ఏదోవిధంగా దొంగతనంగానైనాసరే, రెండు మూడు రెట్లు ఎక్కువ ధర ఇచ్చుకునైనాసరే, శిక్ష అనుభవించడానికి సిద్ధమైకూడా తన కక్కుర్తి నెరవేర్చుకు తీరుతాడు. ఇందువల్ల అటు ప్రభుత్వానికీ నష్టం; ఇటు పేదరైతులకు నష్టం. ఇలా రెండిందాలా నష్టంవచ్చే పని ఎందుకు చెయ్యాలి చెప్పండి. అదీగాక ఒక్కొక్కడికి మత్తుపదార్థాల వల్ల ఉపయోగముంటుంది. నామటుకు నాకు ఒక్కరోజు నల్లమందు వేసుకోకపోతే కాళ్ళు పీక్కొనిపోతుంటాయి. ఊపిరాడకుండా పోయి జలుబు లంకించుకుంటుంది.

'సారా త్రాగితే వంట్లో మంచి హుషారుగానే ఉంది' అన్న దొక గొంతు.

'సర్కారు అధర్మపద్ధతుల్లో ధనం సంపాదిస్తోంది. ఇది న్యాయం కాదు. అధర్మపరుల రాజ్యంలో ప్రజలకు మేలు ఎలా జరుగుతుంది?' — ఒక సందేహం.

'మొదట సారా తాగటం మరిపి పిచ్చివాళ్ళను చేశారు. అలవాటుపడగానే డబ్బుకక్కుర్తిపడటం మొదలు. ఇటు కూటికీ, గుడకూ, అటు బ్రాందీ, సారాలకూకూడా సరిపోయేటంత కూలెక్కడ దొరుకుతుందీ? ఇక పోతే పెళ్ళాం బిడ్డలను పస్తులతో మాడ్చాలి. లేకుంటే దొంగతనం చెయ్యాలి; జూదం ఆడాలి; నమ్మకద్రోహాల కొడిగట్టాలి. అంతేగా! - బాబూ! అది సారా దుకాణం కాదు, మన బానిసత్వానికి పుట్టిల్లయితే!' అన్నది మరో గొంతు.

# 4

చౌధరీ ఉపదేశాలు వినటానికి జనం విరుచుకు పడేవాళ్ళు. ప్రజలకు నుంచోటానికికూడా స్థలం దొరికేది కాదు. రోజు రోజుకూ చౌధరీ ప్రతిష్ఠ వృద్ధవుతోంది. ఆయన గృహంలో పంచాయతీలూ, దేశౌన్నత్యం వీటిని గురించి చర్చలు జరుగుతుండేవి. ఇందువల్ల ప్రజలకు ఎంతో ఆనందోత్సాహాలు కలిగేవి. వాళ్ళ రాజకీయ చైతన్యం వృద్ధయ్యేది. వాళ్లు తమ ప్రతిష్ఠనూ, గొప్పతనాన్నీ గుర్తించసాగారు. తమ శక్తిని తాము అర్థం చేసుకోసాగారు. నిరంకుశత్వం, అన్యాయం అంటే మండిపడేవాళ్లు; వాళ్ళు స్వతంత్రాన్ని రుచిచూశారు. తమ ఇళ్ళల్లోని పత్తి, తమ యిళ్ళల్లో వొడికిన నూలూ, తమ ఇళ్ళల్లో నేసిన బట్ట, తమ స్వంతభోజనం, స్వంత కోర్టు !– ఇంకేం కావాలి? పోలీసు భయం లేదే. అధికార్లవద్ద చేతులు నలపవలసిన పనిలేదు. సుఖంగా, శాంతంగా జీవితం గడుపుతున్నారు. మత్తుపదార్థాలను ఎందరో విసర్జించారు. మంచి మంచి భావాలు తరంగాలలాగా వ్యాపిస్తున్నాయి.

కాని భగత్ అంత అదృష్టవంతుడు కాదు. రోజురోజుకూ ప్రజలకు ఆయన ఉపదేశాలంటే ఏవగింపు అధికమైపోతోంది. చివరకది ఎంతవరకు వచ్చిందంటే కరణాలు, సెట్టివాళ్లు, బడిపంతుళ్ళు, ఆ ఉద్యోగులతో తిరిగే కొద్దిమంది తప్పితే, ఆయన మాటలు వింటానికి మరెవరూ వుండేవాళ్ళేకాదు. అప్పుడప్పుడు పెద్దపెద్ద ఆఫీసర్లుకూడా వస్తుండేవాళ్ళు. భగత్‌జీని ఎంతో గౌరవించేవాళ్ళు. కాసేపు ఆయన కళ్ళనీళ్ళు తుడిచి వెళ్ళేవాళ్ళు. క్షణకాలపు గౌరవం నిత్యమూ జరిగే అవమానానికేమి సాటి ? ఆయన ఎక్కడికి వెళ్లినా వేలెత్తి వెక్కిరించేవాళ్ళే. ఒకడు ముఖస్తుతిరాయుడనేవాడు. మరొకడు సి.ఐ.డి. పోలీసు అనేవాడు. భగత్ తన పోటీదారు ప్రతిష్ఠకూ, తనను గురించి జరిగే లోకదూషణకూ లోలోపలే కుమిలిపోయేవాడు. తన శత్రువు ఎదుట హీనంగా తల ఒగ్గవలసిన పరిస్థితి ఏర్పడటం ఆయన జీవితంలో యిదే

మొదటిసారి. తన సర్వస్వాన్నీ బలిపెట్టి ఎంతోకాలంనుండీ కంటికి రెప్పగా కాపాడుకుంటూ వచ్చిన వంశప్రతిష్ఠంతా ఈ రోజు గంగలో కలిసిపోయింది. ఈ తీరని దిగులు ఆయన్ను ఒక క్షణం గూడా విశ్రాంతిగా ఉండనిచ్చేదికాదు. తన పోయిన ప్రతిష్ఠను తిరిగి రాబట్టు కోవట మెలా? తన పోటీదారును అణగద్రొక్కటానికి ఏది ఉపాయం? ఆయన గర్వభంగం చేసే మార్గమేది?— నిత్యం ఈ సమస్యే ఆయనను వేధిస్తుండేది.

చివరకు ఆయన సింహాన్ని దాని గుహలోనే పడగొడదామని నిశ్చయించుకున్నాడు.

అది సాయం సమయం. చౌధరీ వాకిటముందు ఒక పెద్ద సభ జరుగుతోంది. చుట్టుప్రక్క గ్రామాల రైతులుగూడా వచ్చారు. వేల కొలదీ ప్రజలు హాజరైనారు. చౌధరీ వాళ్ళకు స్వరాజ్య సంబంధమైన బోధలు చేస్తున్నాడు. మాటిమాటికీ 'భారత్ మాతాకీ జై!' అనే నినాదాలు వినడుతున్నాయి. ఒకవైపు స్త్రీలు గుమిగూడారు. చౌధరీ తన ఉపదేశం ముగించి తన కుర్చీలో కూర్చున్నాడు. వలంటీర్లు స్వరాజ్య నిధికి చందాలు వసూలు చేయటం ప్రారంభించారు. ఇంతలో ఎక్కడ నుండి వచ్చాడో తెలియదు; భగత్‌జీ శ్రోతలముందు నిలబడి పెద్దగా యిలా ఉపన్యసించాడు—

'సోదరులారా! నన్నిక్కడ చూచి ఆశ్చర్యపడకండి. నేను స్వరాజ్యానికి శత్రువునుకాను. స్వరాజ్యాన్ని నిందించే పతితుడూ, పాపాత్ముడూ ఎవడుంటాడు చెప్పండి? కాని దాన్ని సాధించటానికి మార్గం మీరు అమితంగా వ్యామోహపడుతున్న చౌధరీ విధానం కాదు. పరస్పర కలహం, నీచప్రవృత్తి కళ్ళకు కట్టినట్లు కనపడుతుంటే పంచాయతీలవల్ల ప్రయోజనమేముందీ? భోగవిలాసాల భూతం శిరస్సు మీద నాట్యం తొక్కుతుంటే అది మనల్నెలా వదిలిపెడుతుంది చెప్పండి. కల్లుదుకాణాలను బహిష్కరించడం సాధ్యమయ్యే విషయమేనా? సిగరెట్లు, సబ్బులూ, మేజోళ్ళు, బనియనులు, అద్దుసిల్కులు, వీటి పీడ వదలమంటే ఎట్లా వదులుతుంది. దర్పం, అధికారవ్యామోహం తాండవమాడుతుంటే సర్కారు పాఠశాలలు ఎలా బహిష్కరిస్తారు.

పరాయి మతస్తుల విద్యాశృంఖలాలనుండి విముక్తి కాగలిగేదెలా? స్వరాజ్యసాధనకు ఒక్కటే ఉపాయముంది. అదే ఆత్మనిగ్రహం ఈ మహౌషధం మీ సమస్తవ్యాధులను సమూలంగా హతమారుస్తుంది. ఆత్మదౌర్బల్యమే పరాధీనతకు మూలకారణం. ఆత్మశక్తిని పెంపొందించండి. ఇంద్రియాలను స్వాధీనం చేసుకోండి. మనస్సును అదుపులో ఉంచుకోండి. అప్పుడే మీలో సోదరభావం పెల్లుబుకుతుంది. అప్పుడే మనస్పర్థలు అంతరిస్తాయి. అప్పుడే ఈర్ష్యాద్వేషాలు నశిస్తాయి. ఆనాడే భోగవిలాసాలంటే ఏవగింపు ఏర్పడుతుంది. ఆనాడే మత్తుపదార్థాల వ్యసనం నశిస్తుంది. ఆత్మశక్తి లేకుండా స్వరాజ్యం ఎన్నటికీ ప్రాప్తించదు. అన్ని పాపాలకూ మూలం స్వార్థమే. అదే మిమ్మల్ని కోర్టుల కెక్కిస్తోంది. అదే మిమ్మల్ని పరాయిమతస్తుల విద్యకు దాసులను చేస్తున్నది. ఈ స్వార్థపిశాచాన్ని ఆత్మశక్తితో హతమార్చండి; మీ కోరికలు ఫలిస్తాయి. నేను యాభైసంవత్సరాలబట్టీ నల్లమందు సేవిస్తున్నానన్న విషయం అందరకూ తెలిసిందే.

"ఈ రోజునుండీ నల్లమందంటే ఘోరకంగా భావిస్తాను. చౌధరీతో మాకు మూడు తరాలబట్టీ విరోధముంది. కాని యీ రోజునుండీ చౌధరి నా సోదరుడు. ఈ రోజునుండీ మా ఇంట్లో ఏఒక్కరైనా సరే యింట్లో వడకిన నూలుతో తయారైనగుడ్డ కాకుండా మరోగుడ్డ కట్టుకుంటే మీ యిష్టమొచ్చిన శిక్ష వెయ్యండి. నేను చెప్పదలచిందింతే. భగవంతుడు మనందరి వాంఛలు నెరవేర్చుగాక!"

ఈ మాటలని భగత్‌జీ యింటికి బయలుదేరాడు. ఇంతలో చౌధరీ పరుగెత్తుకువచ్చి ఆయన్ను కౌగలించుకున్నాడు. మూడు తరాల శత్రుత్వం ఒక్క గడియలో అంతరించింది.

ఆ రోజునుండీ చౌధరీ, భగత్‌జీ యిద్దరూ కలిసి స్వరాజ్య ప్రబోధం చేయసాగారు. వారిద్దరూ గాఢ మిత్రులైనారు. ఇప్పుడు ప్రజలు వారిద్దరిలో ఎవరిని ఎక్కువగా గౌరవిస్తారో తేల్చి చెప్పటం కష్టమే.

పోటీరూపంలో ఉన్న అగ్నికణం వారి హృదయ జ్యోతులను ప్రకాశవంతం చేసింది.

# ఆత్మారామ్

బేంద్రో గ్రామంలో మహాదేవ్ అనే పేరుప్రఖ్యాతులుగల కంసాలి ఒకడుండేవాడు. అతను ఉదయం మొదలు సాయంత్రంవరకూ తన వసారాలో కుంపటిముందు కూర్చుని సుత్తితో ఖట్ ఖట్‌మని కొడుతూ పని చేస్తుండేవాడు. అదేపనిగా వినపడే ఈ ధ్వనికి ప్రజలు ఎంతగా అలవాటుపడ్డారంటే, ఏ కారణంవల్లనైనా ఆధ్వని ఆగిపోవటం జరిగితే ఏదో వస్తువు మాయమైపోయినట్లనిపించేంది. అతను ప్రతి నిత్యం ఒక్కసారి ఉదయం తెల్లవారకముందే లేచి, తన చిలక పంజరం చేత బట్టుకుని ఏవో కీర్తనలు పాడుకుంటూ చెరువు వైపుకు వెళ్ళేవాడు. ఆ మసక వెలుతురులో అతని ముసలి శరీరం, బోసినోరూ, వంగిన నడుమూ చూస్తే అపరిచితుడెవరికైనా అతను పిశాచమేమో ననే భ్రమ కలిగితీరుతుంది. 'కల్లెంతో, నిజమెంతో గురుడు హరుడెరుగురా' అనే పాట జనం చెవిని బడగానే తెల్లవారిందనుకునేవాళ్ళు.

మహాదేవ్ కుటుంబ జీవితం సుఖవంతమైంది కాదు. అతనికి ముగ్గురు కొడుకులూ, ముగ్గురు కోడళ్ళూ, డజనుల కొలదీ మనుమలూ, మనుమరాళ్ళూ ఉన్నారు. కాని అతని బరువు తగ్గించేవాళ్ళు ఒక్కరూ

లేరు. 'నాన్న ఉన్నంతవరకూ హాయిగా ఆనందంగా ఉందాం. తరువాత ఎటూ యీ డోలు మెడకు తగులుకోక తప్పదుగా' అనే వాళ్ళు. పాపం అప్పుడప్పుడు మహాదేవ్ పస్తుపడుకోవలసివచ్చేది. భోజన సమయంలో ఆయనింట్లో సామ్యవాదం ప్రళయాంతకంగా గర్జించేది. అతను ఆకలి తీరకుండానే లేచిపోయి నారికేళహుక్కా త్రాగుతూ నిద్ర పోయేవాడు. అతని వృత్తిగూడా మరింత అశాంతికరంగానే ఉండేది. అతను తన పనిలో చాలా నిపుణుడు. అతని పనితనం యితరులకంటె చాలా శుద్ధంగా ఉంటుంది. అతను బంగారం కరిగే విధానంగూడా విలక్షణంగా ఉండేది. అయినా ఆయన్ను నిత్యం అనుమానస్తులూ, పిరికి వాళ్ళూ శాపనార్థాలు పెడుతూనే ఉండేవాళ్ళు. కాని మహాదేవ్ అచంచల గాంభీర్యంతో తలవంచుకుని అన్నీ వింటూ వుండేవాడు. తగాదా కాస్త చల్లబడగానే అతను తన చిలకవైపు చూచి 'కల్లెంతో నిజమెంతో గురుడు హరు డెరుగురా' అనేవాడు. ఈ మంత్రాన్ని జపించగానే అతని మనస్సుకు సంపూర్ణ శాంతి లభించేది.

## 2

ఒకనాడు దైవికంగా కుర్రాడెవరో పంజరపుద్వారం తెరిచాడు. చిలక ఎగిరిపోయింది. మహాదేవ్ తలయెత్తి చూచేసరికి అతనికి గుండె ఆగిపోయినంత పనైంది. ఏదీ చిలక! అతను మళ్ళీ చూచాడు పంజరం వైపు. చిలక మాయమైపోయింది. మహాదేవ్ గాబరాపడుతూ లేచాడు. అటూ యిటూ యింటికప్పులవైపు దృష్టి సారించసాగాడు. ప్రపంచంలో అతనికి ప్రియమైన దేదైనావుంటే అది ఆ చిలక ఒక్కటే పిల్లా,జల్లా, మనుమలూ, మనుమరాండ్రంటే అతనికి విసుగెత్తిపోయింది. పిల్లలఅల్లరి వల్ల అతని పనికి ఆటంకం కలుగుతుండేది. కొడుకులంటే అతనికి చాలా అయిష్టంగాఉండేది. అందుకు కారణం వాళ్లు పనికిమాలిన వాళ్ళని గాదు. వాళ్ళమూలంగా తన కోర్కెల నెన్నిటినో చంపుకో

వలసి వచ్చింది. ఇరుగుపొరుగువాళ్ళంటే ఆయనకు మహాచిరాకుగా ఉండేది. ఎందువల్లంటే వాళ్లు తన కుంపటిలోనుండి నిప్పులు తీసు కెళుతుండేవాళ్లు. ఈ సమస్త బాధలనుండీ అతనికి శరణు లభించే దిక్కెక్కడైనా ఉంటే అది ఆ చిలకే. అతనికి ఏ విధంగానూ బాధ కలి గించని దదొక్కటే. ప్రశాంతంగా కాలం గడుపుదామనే తప్ప, మరో కోరికే ఉండటానికి అవకాశంలేని వయసులో ఉన్నా డాయన.

చిలక ఒక పెంకుటింటి కప్పుమీద కూర్చుని వుంది మహాదేవ్ పంజరం దించి చిలకకు చూపిస్తూ 'రా ! రా ! కల్లెంతో నిజమెంతో గురుడు హరు డెరుగులే' అనటం ప్రారంభించాడు. కాని యింట్లో పిల్లలూ, ఊళ్లో పిల్లలూ అంతా పోగై కేకలు పెట్టటం, చప్పట్లు కొట్టటం సాగించారు. పై నుండి 'కావ్, కావ్' మంటూ కాకులు గోలపెడుతున్నాయి చిలక ఎగిరిపోయి ఊరి బయటువున్న ఒక చెట్టు మీద వాలింది. ఖాళీ పంజరం చేతబట్టుకుని మహాదేవ్ దాని వెంట అదేపనిగా పరుగెత్తాడు. అతని పరుగు వేగాన్ని చూచి జనానికి అంతులేని ఆశ్చర్యంగా వుంది. మోహాన్ని గురించి ఇంతకంటె సుంద రమూ. సజీవమూ, భావగర్భితమూ అయిన కల్పన చేయగల్గటం అసంభవం.

రెండు ఝాములైంది. రైతులు పొలాల నుండి తిరిగి వస్తు న్నారు. వాళ్ళకు వినోదానికి మంచి అవకాశం లభించింది. మహా దేవ్‌ను ఏడిపించటం అంటే అందరికీ మజాగానే ఉండేది. ఒకడు చిలకమీదికి రాళ్ళు విసిరాడు. మరొకడు చప్పట్లు కొట్టాడు. చిలక మళ్ళీ అక్కడినుండి ఎగిరిపోయి, అక్కడికి చాలా దూరంగా ఉన్న మామిడితోటలో ఒక చెట్టు చిటారు కొమ్మమీద వాలింది. మహాదేవ్ మళ్ళీ ఆ ఖాళీ పంజరం చేతబట్టుకుని కప్పమాదిరి ఎగురుకొంటూ వెళ్ళాడు. తోటలోకి చేరుకునే సరికి కాళ్ళు మండిపోతున్నాయి. తల తిరిగిపోతోంది. కాస్త అలుపు తీర్చుకున్న తరువాత మళ్ళీ పంజరం పైకెత్తి 'కల్లెంతో నిజమెంతో గురుడు హరు డెరుగులే' అని పాడు తున్నాడు. చిలక చిటారు కొమ్మమీదినుండి క్రింది కొమ్మమీదకు వచ్చి కూర్చుంది. కాని మహాదేవ్‌వైపు సందేహ దృక్కులతో

పొంచి చూస్తున్నది. భయపడుతోంది కాబోలనుకున్నాడు మహా దేవ్. పంజరాన్ని అక్కడ వదలి తాను మరో చెట్టుచాటుకు పోయి దాక్కున్నాడు. చిలక నాలుగువైపులా పరీక్షగా చూచింది. ఇక భయం లేదులే అనుకుంది. ఎగిరి వచ్చి పంజరంమీద కూర్చుంది. మహాదేవ్ హృదయం పొంగిపోయింది. 'కల్లెంతో నిజమెంతో గురుడు 'కల్లెంతో నిజమెంతో గురుడు హరు డెరుగులే' అనే మంత్రం జపిస్తూ మెల్లగా, నిదానంగా చిలకదగ్గరకు చేరుకున్నాడు. చిలకను పట్టు కుందామని ఒక్క గంతు వేశాడు. కాని చిలక చేతికి చిక్కలేదు. మళ్లీ చెట్టుమీదికి పోయికూర్చుంది.

సాయంత్ర మయ్యేదాకా యిలాగే జరిగింది. చిలక ఒకసారి ఈ కొమ్మమీద, ఒకసారి ఆ కొమ్మమీద వాలేది. ఒక్కొకసారి పంజరం వాకిలివద్ద వాలి తనకు నీళ్లూ, మేతా పెట్టే పాత్రలను చూచి మళ్లీ ఎగిరిపోయేది. ఆ వృద్ధుడు మూర్తీభవించిన మోహమైతే, ఆ చిలక మూర్తీభవించిన మాయ. ఇంతలో ప్రొద్దు గూకిపోయింది. మాయా మోహాల ఈ సంగ్రామం అంధకారంలో విలీనమైపోయింది.

## 3

రాత్రయింది. నలువైపులా దట్టంగా అంధకారం వ్యాపించింది. చిలక ఆకులమధ్య ఎక్కడ దాక్కున్నదో తెలియలేదు. రాత్రిపూట అది ఎక్కడికీ ఎగిరిపోలేదనీ, పంజరంలోకికూడా రాలేదనీ మహాదేవ్‌కు తెలుసు. అయినా అతని కా చోటునుంచి కదలాలన్న తలంపే లేదు ఆరోజు ప్రొద్దున్నుంచీ ఏమీ తినలేదు. రాత్రి భోజనం చేసేవేళకూడా దాటిపోయింది. గొంతులో గ్రుక్కెడు నీళ్ళుగూడా పోసుకోలేదు. అయినా అతనికి ఆకలీ లేదు, దాహమూ లేదు. చిలక దగ్గరలేని జీవితం అతనికి నిస్సారం, నీరసం, శూన్యం అనిపిస్తోంది. అతను రాత్రిం బవళ్ళు పనిచేసేవాడు. ఎందుకు చేస్తున్నాడంటే అందుకతని అంతః

ప్రేరణే కారణం. జీవితంలో తదితర పనులన్నీ అలవాటు గనుక చేసేవాడు. ఆ పనులు చేసేకాలంలో తాను జీవించే ఉన్నా నన్న చైతన్యం లేశమాత్రంకూడా ఉండేదేకాదు. ఆ చైతన్యాన్ని గుర్తుచేసే వస్తువు ఆ చిలకే. అది అతని చెయ్యి జారిపోవటమంటే జీవుడు దేహాన్ని త్యజించినంతపనే!

రోజంతా ఆకలిదప్పులకు లోనై అలసి సొలసి వున్న మహాదేవ్ ఉండి, ఉండీ కునికిపాట్లు పడుతున్నాడు. కాని మరుక్షణంలోనే ఉలిక్కిపడి కళ్లు తెరిచేవాడు. ఆ పరుచుకున్న అంధకారంలో "కల్లెంతో నిజమెంతో గురుడు హారు డెరుగులే" అని తత్వగానం చేస్తున్న అతని కంఠస్వరం వినిపించేది.

అర్థరాత్రి దాటిపోయింది. అకస్మాత్తుగా అత నేదో అలికిడి విని త్రుళ్లిపడ్డాడు. చూచాడు; తోటలోనే మరో చెట్టుక్రింద ఒక దీపం మసకగా వెలుగుతోంది. చాలామంది కూర్చుని వాళ్లలో వాళ్ళు మాటాడుకుంటున్నారు. వాళ్ళంతా భంగు త్రాగుతున్నారు. పొగాకు వాసనగాలి సోకగానే అతను యిక ఆగలేకపోయినాడు. "కల్లెంతో నిజమెంతో గురుడు హారు డెరుగులే" అని పెద్దగా అని, భంగు త్రాగటంకోసం తనుగూడా వా ళ్ళున్నవైపు బయలుదేరాడు. కాని తుపాకిమ్రోత వినగానే లేళ్ళు ఏవిధంగా పారిపోతాయో, అలాగే అతను రావటం చూచి అందరూ లేచి ఎక్కడివాళ్ళక్కడ పారి పోయారు. తలా ఒకప్రక్కకూ చెల్లాచెదరై పోయారు. 'ఆగండి, ఆగండి!' అని కేకలు వేయసాగాడు మహాదేవ్. తటాలున వాళ్ళంతా దొంగలని గ్రహించాడు. "దొంగలు! దొంగలు! పట్టుకోండి! పట్టుకోండి!" అని పెద్దగా కేకలువేశాడు. దొంగలు తిరిగి చూడకుండా పరుగెత్తిపోయారు.

మహాదేవ్ దీపంవద్దకు వెళ్ళాడు. అక్కడ కలశ మొకటుంది. చిలుంపట్టి నల్లగా వుందది. మహాదేవ్ హృదయం పొంగులు వారు తోంది. కలశంలో చెయ్యిపెట్టి చూచా డతను. అందులో నవర్సు లున్నాయి. ఒక నవర్సు బయటకుతీసి దీపపు వెలుతురులో చూచాడు. ఔను! నవర్సే అది. అతను వెంటనే కలశం తీసుకుని దీపం చల్లార్చి

చెట్టుక్రిందికిపోయి దాక్కుని కూర్చున్నాడు. పనివాడల్లా దొంగగా మారాడు.

మళ్ళీ అతని కొక సందేహం కలిగింది. దొంగలు మళ్ళీ తిరిగి వచ్చి తనను ఒంటరిగాచూచి నవర్సులు లాక్కు పోతారేమో! అతను కొన్ని నవర్సులు నడుముకు గట్టుకున్నాడు. తరువాత ఎండుపుల్ల ఒకటి సంపాదించి భూమిలో చాలాగోతులు తీశాడు. వాటినిండా నవర్సులు పోసి మట్టి కప్పేశాడు.

# 4

మహాదేవ్ మానసిక నేత్రా లిప్పుడు మరో నూతన జగత్తును వీక్షించుతున్నాయి. ఆలోచనలతోనూ, కల్పనలతోనూ నిండిన జగత్తది. ఆ ధనం చెయ్యిజారిపోతుందేమో ననే భయం యింకా పీడిస్తున్నా, కోరికలు తమ పని అప్పుడే ప్రారంభించాయి. ఒక చక్కని భవనం తయారైపోయింది. షరాబు బజారులో మంచి దుకాణం ఒకటి ప్రారంభమైంది. తన బంధువు లందరితో మంచి సంబంధాలు ఏర్పడినాయి. విలాసవస్తువులన్నీ సమకూరినాయి ఆ తరువాత తీర్థయాత్రకు బయలుదేరాడు. అక్కడినుండి వచ్చి మహా వైభవంగా యజ్ఞం, బ్రహ్మాండమైన సమారాధన జరపించేశాడు. ఆ తరువాత ఒక శివాలయమూ, కోనేరూ తయారైపోయినాయి. అక్కడ తాను ప్రతినిత్యం పురాణ కాలక్షేపం చేస్తున్నాడు. సాధువులకూ, యోగులకూ ఆదర సత్కారాలు అమోఘంగా జరిగి పోతున్నాయి.

తటాలున దొంగలు గనుక తిరిగివస్తే తా నెలా పారిపోతానా అనే ఆలోచన కలిగిం దతనికి. అతను పరీక్షగా చూసుకోటం కోసం కలశం పైకెత్తుకుని రెండు వందల గజాల వరకూ అతి వేగంగా పరుగెత్తి వెళ్ళాడు. అతనికి తన కాళ్ళకు రెక్కలు వచ్చాయేమో ననిపిం

చింది. దిగులు తీరిపోయింది. ఇలాంటి ఊహలతోనే రాత్రంతా గడిచిపోయింది. ఉషఃకాంతులు వ్యాపిస్తున్నాయి. మలయమారుతం వీస్తున్నది. పక్షులు గానం చేస్తున్నాయి. అకస్మాత్తుగా మహాదేవ్‌కు ఈ పాట వినబడింది.

"కల్లెంతో నిజమెంతో గురుడు హరు డెరుగురా!
ఉల్లంబు కోదండపాణిపై నిలుపరా!"

ఈ తత్త్వం ఎల్లప్పుడూ అతని నాలుక కొననే ఉండేది. ఆ పాట రోజూ వేలసార్లు వల్లిస్తుండేవాడు. కాని ఆ పాటలో ఉన్న ధర్మతత్వం అతని అంతరాత్మ నెప్పుడూ స్పృశించలేదు. సన్నాయిలో నుండి వచ్చే రాగంలాగా అతని నోటినుండి ఈ నిరర్థకమైన, ప్రభావ శూన్యమైన ఈ తత్వం వినబడుతుండేది. అప్పు డతని హృదయ రూపంలో ఉన్న వృక్షం పల్లవ విహీనంగా ఉండేది. ఆ తత్వంలో ఉన్న నిర్మల మారుతం ఆ వృక్షాన్ని ఊగించలేకపోయేది. కాని ఇప్పుడా వృక్షానికి కొమ్మలూ, రెమ్మలూ ఉద్భవించాయి. ఈ వాయుప్రవాహానికి వృక్షం ఉయ్యాల లూగిపోయింది. ప్రతిధ్వనించింది.

అరుణోదయ సమయమైంది. ప్రకృతి ఒకవిధమైన అనురాగ భరితమైన ప్రకాశంలో మునకలు వేస్తోంది. అదే సమయంలో చిలక రెక్కలు విప్పుకుని పైకొమ్మనుండి కిందికి వచ్చి వాలింది. ఆకాశం నుండి ఏదో నక్షత్రం రాలిందా అన్నట్లు చిలక వచ్చి పంజరంలో కూర్చుంది. మహాదేవ్ మహదానందంతో పరుగెత్తుకు వెళ్ళి పంజరం చేతికి తీసుకుని "రా! ఆత్మారామ్! నన్ను కష్టమైతే చాలా పెట్టావు గాని, నా జీవితాన్నిగూడా తరింపజేశావు. ఇక నిన్ను వెండిపంజరంలో ఉంచుతాను. నీకు బంగారు తొడుగు వేస్తాను" అన్నాడు. అతని రోమరోమంనుండీ భగవంతుని గుణసంకీర్తనం వినిపిస్తోంది. — "ప్రభూ! నీ వెంత దయామూర్తివయ్యా! ఇది నీ అనంత వాత్సల్యం. లేకుంటే నావంటి పాపాత్ముడూ, పతితుడూ నీ దయకు పాత్రుడయ్యే వాడేనా!" ఈ పవిత్ర భావాలతో అతని ఆత్మ వ్యాకులపడిపోయింది. అతను ప్రేమానురక్తుడై గానం చేయసాగాడు —

"కల్లెంతో నిజమెంతో గురుడు హరు డెరుగురా
ఉల్లంబు కోదండపాణిపై నిలుపరా !"

అతను ఒకచేతితో పంజరం పట్టుకుని, కలశం డొక్కకు అనించుకుని ఇంటికి చేరుకున్నాడు.

# 5

మహాదేవ్ ఇంటికి చేరుకునేసరికి యింకా కాస్త చీకటిగానే ఉంది. దారిలో ఒక కుక్క మినహా యింకెవరూ తటస్థ పడలేదు. నవర్సులంటే కుక్కేమీ మక్కువపడదుగా! అతను కలశాన్ని ఒక తొట్లో దాచిపెట్టి దాన్ని బొగ్గుతో బాగాకప్పి తన గదిలో పెట్టేశాడు. తెల్లవారగానే తిన్నగా అతను పురోహితుని ఇంటికి వెళ్లాడు. పురోహితుడు సంధ్యానుష్ఠానాలు పూర్తిచేసుకుని కుర్చున్నాడు— "కేసు రేపే విచారణకు వస్తుంది. కాని యింతవరకూ చేతిలో ఒక చిల్లి గవ్వయినా లేదే! దాతల పరిస్థితులుగూడా ఏమీ బాగుండలేదు. రేపు మరి ఎలాగో ఏమో!" అని ఆలోచిస్తున్నా డతను. ఇంతలో మహాదేవ్ వచ్చి నమస్కరించాడు. పురోహితుడు ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు. ఈ దరిద్రపు పీనుగ ఎక్కడనుంచి వచ్చిందీ! ఇవ్వాళ తిండి ప్రాప్తమైనా ఉందో లేదో అనుకున్నాడు. "ఏమయ్యా! ఏమిటి సంగతి! ఈసమయంలో పూజలో ఉంటానని తెలియదటయ్యా?" కోపంగా అన్నాడు పురోహితుడు. "ఇవ్వాళ మా యింట్లో సత్యనారాయణ వ్రతమండీ" అన్నాడు మహాదేవ్.

పురోహితుడికి ఆశ్చర్యం వేసింది. తన చెవులను తానే నమ్మలేకపోయినాడు. తన యింట్లో బిచ్చగాడికి ముష్టిరాబట్టటం ఎంత అసాధారణ ఘటనో, మహాదేవ్ యింట్లో సత్యనారాయణవ్రతం జరగటంకూడా అలాంటిదే. "ఇవ్వాళ ఏమిటి విశేషం?" ప్రశ్నించాడతను.

"ఏమీ లేదు. ఏదో యివాళ పరమాత్ముని గాథలు విందామని బుద్ధిపట్టింది. అంతే" అన్నాడు మహాదేవ్.

ఉదయంనుండే ఏర్పాట్లు జరుగుతున్నాయి. బేందో గ్రామం లోనూ, సమీప గ్రామంలోనూ అందరికీ తాంబూలాలిచ్చి వచ్చారు. కథాశ్రవణానంతరం విందుకుకూడా ఆహ్వానించారు. 'అరె! ఈ పర్రలో గరికెలా మొలిచిందో!' విన్న ప్రతివాడూ విస్తుపోయేవాడే!

సాయంత్రం అందరూ చేరినతరువాత పురోహితుడుతన పీఠంపైన ఆసీనుడైనాడు: అప్పుడు మహాదేవ్ నిలబడి పెద్దగా యిలా అన్నాడు: "సోదరులారా! నా బ్రతుకంతా మోసంతోనూ, కపటంతోనూ గడిచిపోయింది. నేను ఎంతమందిని దగా చేశానో లెక్కలేదు. కల్తీయేలేనివస్తువులను ఎంతగా ఖరాబుచేశానో చెప్పలేను. కాని నన్ను భగవంతుడు కరుణించాడు. ఆయన నా కళంకాన్ని కడిగి వెయ్యాలని సంకల్పించాడు. సోదరులందరికీ నేను నిష్కర్షగా చెబుతున్నాను. నానుంచి మీ కెంత రావాలో ఎవరెవరి సొమ్ము నే నెంత కాజేశానో, ఎవరెవరి మంచి బగారంలో ఎంతెంత కల్తీకలిపానో లెక్కచూచుకుని వాళ్ళంతావచ్చి తమకు రావలసింది చిల్లిగవ్వతో సహా తీసుకు వెళ్ళండి. ఇక్కడికి రాలేనివారెవరైనా ఉంటే రేపటినుండీ నెలరోజులలోపల ఎప్పుడైనాసరే తమ యిష్టంవచ్చినప్పుడు వచ్చి లెక్కచూచుకుని తీసుకువెళ్ళవచ్చని అందరికీ తెలియజెయ్యండి."

అందరూ స్తంభించిపోయారు ఎవరో ఒక వ్యక్తి ఏదో అంత రార్థంతో 'నేను చెప్పటంలేదుటయ్యా!' అన్నాడు. ఇంకొక వ్యక్తి సందేహంగా "వేలకొలది యివ్వవలసి వస్తాడు. ఏమి తిని తీరుస్తాడు!" అన్నాడు.

"మరి స్వర్గంలో ఉన్నవాళ్ళ సంగతెలా?" పరిహాసంగా అన్నాడొక క్షత్రియుడు.

"వారి వారసులుంటారుగా!" అన్నాడు మహాదేవ్.

కాని ఆ సమయంలో జనానికి 'ఇతనికి ఇంత ధనం ఎక్కడి నుంచి వచ్చిందా?' అని తెలుసుకుందామని ఉన్నంతగా, తమకు రావలసింది వసూలు చేసుకుందామన్న యావే కనపడవేదు. మహాదేవ్

వద్దకువచ్చి అడగటానికెవరూ సాహసించలేదు. పల్లెటూరి జనం తాతలనాటి గొడవలన్నీ తిరిగి తోడటం వాళ్ళకేం తెలుస్తుందీ! అదీ గాక బహుశా అతని వద్దనుంచి ఎంత రావలసుందో వాళ్ళకు గుర్తు కూడా లేదు. ఇటువంటి పవిత్రమయిన వ్రత సమయంలో లెక్కలో పొరపాటు పడతామేమో నన్న భయం వారిని మౌనంలో ఉంచింది. అన్నిటికంటే ముఖ్యమైన విషయం మహాదేవ్ మంచితనం వాళ్ళను వశీకరించుకుంది.

అకస్మాత్తుగా పురోహితు డిలా అన్నాడు – "నీకు కంఠె చెయ్యమని బంగారమిస్తే నువ్వు చాలా చిన్నాలు మాయం చేశావు. జ్ఞాపకముందా మహాదేవ్!"

"ఆ జ్ఞాపకముంది లెండి. మీ కెంత నష్టం కలిగివుంటుంది!" అన్నాడు మహాదేవ్!

"యాభై రూపాయలకు తక్కువ ఉండదు" అన్నాడు పురోహితుడు.

మహాదేవ్ రెండు నవర్సులు తీసి పురోహితుని ముందుంచాడు.

పురోహితుని దురాశను గురించి వాఖ్యానాలు బయలుదేరినాయి. "యింత విశ్వాసఘాతుకమా! మహాఅయితే నాలుగైదు రూపాయలు నష్టపడి ఉంటాడేమో, పాపం అతని దగ్గర ఏభైరూపాయలు గుంజుకున్నాడు. భగవంతుడున్నాడన్న భయమైనా లేదు. కావడానికి పండితుడు మళ్ళీ! నీతి చూడబోతే రోత! రామ రామా!"

ప్రజలకు మహాదేవయ్యంటే ఒక విధమైన గౌరవం ఏర్పడింది; ఒక గంట గడిచింది. కాని ఆ వేల జనంలో ఒకడైనా ముందుకు రాలేదు. అప్పుడు మహాదేవ్ మళ్ళీ యిలా అన్నాడు: "మీరు మీలెక్కా డొక్కా మరిచి పోయినట్లున్నారు. సరె! ఇవ్వాళ కథాశ్రవణం కానీండి, నేను నెలరోజులవరకూ మీ కోసం నిరీక్షిస్తుంటాను. ఆ తరువాత తీర్థయాత్రలకు వెళ్ళిపోతాను, సోదరులందరూ నన్ను ఉద్ధరించండని కోరుతున్నాను."

మహాదేవ్ ఒక వారం రోజులవరకూ వాళ్ళ రాక కోసం

ఎదురు చూచాడు. రాత్రిపూట దొంగల భయంవల్ల నిద్ర పట్టేది కాదు. ఇప్పు డతను పని చెయ్యటమే మానివేశాడు. త్రాగుడు వ్యసనం కూడా వదలిపోయింది. వాకిట్లోకి వచ్చిన అతిథి అభ్యాగతులను తగిన విధంగా సత్కరించేవాడు. అతని సత్కీర్తి దూర దూరాలకు వ్యాపించింది. ఇంతలో గడువు పూర్తయిపోయింది, లెక్క చూచుకుని పైకం తీసుకు వెళ్ళేందుకు ఒక్కరూ రాలేదు. ప్రపంచంలో ధర్మపరాయణత్వం, సత్ప్రవర్తన ఎంతగా ఉందో ఇప్పుడు గ్రహించాడు మహాదేవ్. ప్రపంచం చెడ్డవాళ్ళకు చెడ్డదని, మంచి వాళ్ళకు మంచిదని యిప్పుడర్థమైందతనికి.

# 6

ఈ ఘటన జరిగి ఏభైసంవత్సరాలైంది. మీరు బేందోగ్రామం వెళితే దూరం నుండే బంగారు వన్నెగల కలశ మొకటి కనిపిస్తుంది. ఆ గ్రామ దేవాలయ కలశమది. దానికి ఆనుకుని పెద్ద చెరువొక టుంది. అందులో విరివిగా తామరలు పూసివుంటాయి. ఎవరూ అందులో చేపలు పట్టరు. చెరువు ఒడ్డున ఒక పెద్ద సమాధి ఉన్నది. అదే ఆత్మారామ్ స్మృతి చిహ్నం. దాన్ని గురించి అనేక వదంతు లున్నాయి. కొందరు అతని రత్నాలు చెక్కిన పంజరం స్వర్గానికి వెళ్ళిందంటారు. 'కల్లెంతో నిజమెంతో; గురుడు హరు డెరుగురా' అని గానం చేస్తూ అంతర్ధానమైందంటారు మరికొందరు. కాని నిజం మాత్రం యిది. అతని చిలక రూపంలో వున్న చంద్రుణ్ణి, పిల్లి రూపంలో ఉన్న ఏ రాహువో గ్రసించింది. ఇప్పటికీ అర్ధరాత్రివేళ ఆ చెరువు ఒడ్డున ఈ పాట వినిపిస్తుందంటారు.

'కల్లెంతో నిజమెంతో గురుడు హరు డెరుగురా! ఉల్లంబు కోదండపాణిపై నిలుపరా!'

మహాదేవ్‌నుగురించి ఎన్నో కింవదంతు లున్నాయి. అందులో అన్నిటికంటె ప్రామాణికమైన దిది; మహాదేవ్ విరాగి అయిన తరువాత అనేకమంది సన్యాసులతో కలిసి అతను హిమాలయాలకు వెళ్ళిపోయాడు. ఇక అక్కడినుండి మళ్ళీ తిరిగిరాలేదు. అతని పేరు ఆత్మారాం అని ప్రసిద్ధికెక్కింది.

# ప్రేరణ

నా క్లాసులో సూర్యప్రకాశ్‌కు మించిన పోకిరీ కుర్రవాడు మరొకడు లేడు. నేను ఉపాధ్యాయ వృత్తిలో ఉన్న పదిసంవత్స రాల్లోనూ ఇలాంటి విపరీత స్వభావంగల కుర్రవాడెప్పుడూ తటస్థించ లేదు. ఎప్పుడూ పోకిరీ చేష్టల్లోనే గడిపేవాడు. ఉపాధ్యాయులను ఫూల్సును చెయ్యటం, చిరాకెత్తించటం, కష్టపడి చదివే కుర్రాళ్ళను రెచ్చగొట్టి ఏడిపించటం - యిలాంటి పనులంటే అతనికి మహా సంతో షంగా ఉండేది ఎలాంటెలాంటి వ్యూహాలు రచించేవాడు! ఎటు వంటి ఉచ్చులు పన్నేవాడు! ఎలాంటి యెత్తులు వేసేవాడు! చూస్తూంటే ఆశ్చర్యం వేసేది. కుర్రాళ్ళను జట్లుగట్టటంలో మహా ఆరి తేరినవాడు.

రహస్య సైన్యమొకటి తయారుచేసి దాని బలంతో స్కూలు మీద పెత్తనం చలాయించేవాడు. హెడ్‌మాష్టరుగారి ఆజ్ఞయినా ఉల్లం ఘించబడవచ్చుగాని, అతని ఆజ్ఞను ధిక్కరించటానికి మాత్రం ఎవడికీ దమ్ములుండేవికావు. స్కూలు బంట్రోతు, ఆర్డర్లీ అతనంటే గడగడలాడిపోయేవాళ్ళు. ఇన్‌స్పెక్టర్లుగారు తనిఖీకి రాబోతున్నారు.

అందువల్ల హెడ్‌మాష్టరుగారు మామూలు టైముకు ఒక అరగంట ముందుగా రమ్మని అజ్ఞాపించారు. పరీక్షలను గురించి కొన్ని ముఖ్యమయిన విషయాలు చెబుదామని ఆయన ఉద్దేశం. కాని, పదిగంట లయింది. ఇన్‌స్పెక్టరుగారు వచ్చి కూర్చున్నారు స్కూలులో ఒక్క కుర్రాడయినా లేడు. పదకొండుగంటలకు ఏదో బోనులోనుంచి విడుదలై వచ్చినట్లుగా విద్యార్థులందరూ ఒక్కసారి హాజరయినారు. ఇన్‌స్పెక్టరుగారు 'డిసిప్లిన్' చాలా అధ్వాన్నంగా ఉందని రికార్డులో వ్రాశారు. హెడ్‌మాష్టరు గారు అవమానపడ్డారు. ఉపాధ్యాయులకు చెడ్డపేరు వచ్చింది. ఈ పోకిరీ పనికంతకూ కారకుడు సూర్యప్రకాశే ఎంత తిప్పలుపడినా, ఒక్కడూ సూర్యప్రకాశ్ పేరైనా యెత్తలేదు. ఆదర్శంగా క్లాసును నడిపేవిషయంలో నేను చాలా గర్వపడేవాణ్ణి. ట్రయినింగ్ కాలేజీలో గూడా ఈ విషయంలో మంచిపేరు సంపాదించాను. కాని యిక్కడ మాత్రం నా నిపుణతంతా నిరుపయోగమయింది. ఆ ఉద్దండుణ్ణి మంచి దారికి తేవటానికి తగిన ఉపాయ మేమీ తోచేదేకాదు మెదడుకు. అనేకమార్లు ఈ విషయాన్ని గురించి ఉపాధ్యాయుల సమావేశాలు కూడా జరిగినాయి. కాని కీలకం అర్థంకాలేదు. నూతన విద్యావిధానం ప్రకారం నేను దండనీతి విధానానికి అనుకూలుణ్ణి కాదు. కాని ఇక్కడమాత్రం ఈ విధానమంటే విరక్తి కలిగింది. రోగంకంటె చికిత్స అసాధ్య మౌతుందేమోననే భయం ఒకటే యిందుకు కారణం. సూర్యప్రకాశ్‌ను స్కూలు నుండి వెళ్ళగొడదామనే ప్రతిపాదన కూడా వచ్చింది. కాని ఆ పనిచెయ్యటం మా అసమర్థతకు నిదర్శనమవుతుందని ఆ ప్రతిపాదనను అమలుపరచటానికి సాహసించలేక పోయినాం. ఇరవై, ఇరవైరెండేళ్ళ అనుభవం కలిగి, విద్యాబోధనలో నిపుణులైన ప్రొఫెసర్లు కూడా పన్నెండు, పదమూడేళ్ళు వయస్సు గల ఒక పోకిరీ కుర్రవాణ్ణి దారికి తేలేకపోయినారంటే, అది చాలా నిరాశా జనకమయిన విషయం కాదూ! మామూలుగా స్కూలంతా అతనంటే హడలిపోతూనే ఉండేది. కాని అందరికంటె ఇరకాటంలో పడింది నేను. కారణం, అతను నా క్లాసు విద్యార్థి కావటమే. అతని పోకిరీ

పనుల దుష్ఫలితమంతా నేను అనుభవించవలసి వచ్చేది. నేను స్కూలుకు బయలుదేరిన క్షణంనుండీ ఎప్పుడూ ఇవ్వాళ ఏం ముప్పు తెచ్చిపెడతాడో అనే దిగులు వేధిస్తుండేది. ఒకరోజు నేను డ్రాయరు సొరుగు తెరిచేసరికి ఒక పెద్ద గోండ్రుకప్ప అందులోనుండి ఎగిరి పడింది. నేను ఉలిక్కిపడి వెనక్కు తగ్గేసరికి క్లాసంతా గొల్లుమన్నది. నేను సూర్యప్రకాశ్ వైపు క్రోధంగా చూచి ఊరుకున్నాను. కాల మంతా ఉపదేశాలతోనే గడిచిపోయింది. ఆ పోకిరీ తలవంచుకుని ముసి ముసి నవ్వులు నవ్వుతున్నాడు. క్రింది తరగతుల్లో వీడు యెలా ప్యాసయినాడా అని ఆశ్చర్యం కలిగేది నాకు. ఒకనాడు నేను కోపంతో "నీ వీ క్లాసులో జీవితమంతా ప్యాసు కాలేవు" అన్నాను. "నా ప్యాసునుగురించి మీ కేమీ దిగులొద్దులెండి. నేను ఎప్పుడూ ప్యాసవుతూనే వచ్చాను. ఇప్పుడూ అవుతాను" అన్నాడు.

"అసంబవం."

"అసంభవంకూడ సంభవమౌతుంది సార్!"

నేను ఆశ్చర్యంగా అతనివైపు చూస్తున్నాను. ఎంత కుశాగ్ర బుద్ధిగల కుర్రవాడయినా తన ప్యాసును గురించి యింత నిష్కర్షగా మాట్లాడలేడు. 'వీడు ప్రశ్నాపత్రాలు కాజేస్తున్నట్లున్నాడు' అను కున్నాను. ఈసారి ఇతని యెత్తులు ఒక్కటిగూడా పారనియ్యగూడదని ప్రతిజ్ఞచేశాను. 'ఈ తరగతిలో ఎన్నాళ్లు పడిఉంటాడో అదీ చూద్దాం. గాబరాపుట్టి వాడే జారుకుంటాడు' అనుకున్నాను.

సాంవత్సరిక పరీక్షల సందర్భంలో నేను అసాధారణ జాగ రూకతతో పనిచేశాను. కాని సూర్యప్రకాశ్ ఆన్సరుపేపర్లు చూచేసరికి నా ఆశ్చర్యానికి అంతులేదు. నేను రెండు ప్రశ్నాపత్రా లిచ్చాను. రెంటిలోనూ, అతనికి నా క్లాసులో అందరికంటె మార్కులు అధికంగా వచ్చినాయి. నా ప్రశ్నా పత్రాల్లో నిజానికి ఒక ప్రశ్నకుకూడా అతను జవాబు చెప్పలేదని నాకు బాగా తెలుసు కావాలంటే ఈ విషయం నేను రుజువుచేస్తానుగూడా. కాని అతని ఆన్సరు పేపర్లను కాదనటం ఎలా? దస్తూరిలో సందేహం కలిగేటంత తేడా ఏమీ కనపడటంలేదు. ఈ విషయమే నేను హెడ్మాష్టరుగారితో అంటే, ఆయన విభ్రాంతు

డయినాడు. కాని ఆయన గూడా చూస్తూ చూస్తూనే దిగమ్రింగి ఊరుకోవలసి వచ్చింది. నేను బహుశా స్వభావసిద్ధంగానే నిరాశా వాదిని. సూర్యప్రకాశ్‌ను గురించి యితర ఉపాధ్యాయులు ఏమీ విచారంగా ఉన్నట్లు లేదు. ఇటువంటి కుర్రాళ్ళు స్కూలుకు రావటం వాళ్ళ కేమీ కొత్తగా ఉన్నట్లు లేదు. నాకు మాత్రం అత నొక కొరకరానికొయ్యగా ఉన్నాడు. ఈ విధంగానే ఉంటే ఏదో ఒక నాడు అతను జైలుపాలు కావటమో, పిచ్చి ఆసుపత్రికి చేరటమో జరగక తప్పదు.

# 2

ఆ సంవత్సరమే నేను బదిలీ అయినాను. ఇక్కడి వాతావరణం అనుకూలంగానే ఉంది హెడ్మాష్టరుతోనూ, ఇతర ఉపాధ్యాయుల తోనూ బాగా స్నేహంకూడా కలిసింది. అయినా బదిలీ అయినందుకు నేను చాలా సంతోషించాను, ఎందువల్లంటే సూర్యప్రకాశ్‌తో యిక గొడవపడవలసిన అవసర ముండదు. విద్యార్థులు నాకు వీడ్కోలువిందు చేశారు. అందరూ నన్ను సాగనంపటానికి స్టేషనువరకూ వచ్చారు. ఆసమయంలో కుర్రవాళ్ళందరి కళ్ళూ చెమ్మగిల్లినాయి. నేనూ కన్నీటిని ఆపుకోలేకపోయాను. అకస్మాత్తుగా నా దృష్టి అందరికంటె వెనుక సిగ్గుపడుతూ నుంచున్న సూర్యప్రకాశ్ మీద పడింది. అతని కళ్ళు గూడా చెమ్మగిల్లినట్లే ఉన్నాయి. వెళ్ళేటప్పుడు అతనితో రెండు మాటలు మాట్లాడదామనే కోరిక మాటిమాటికీ మనసులో తొలిచింది. బహుశా అతనికీ నాతో ఏదో చెప్పాలనే ఉండి. కాని మొదట నేనూ పలకరించలేదు; అతనూ పలకరించలేదు. ఆ కారణంగా చాలా రోజుల వరకూ విచారంగా ఉండేది. అతని దురుసుతనం క్షమించదగ్గదే, కాని అందుకు నా అభ్యంతరం మాత్రం క్షమార్హంకాదు. జాలిగొలిపే ఆ విషాద సమయంలో నిష్కపటంగా రెండు ముక్కలు అతనితో మాట్లాడి

ఉంటే, అతనిలో ఎంతో మార్పు రావడానికి అవకాశముండేది. ఇలాంటి అవకాశాలను జారవిడుచుకోటానికి మరో పేరే జీవితం. బండి నిదానంగా నడుస్తోంది. కుర్రాళ్ళు కొన్ని అడుగులవరకూ రైలు తోపాటు పరుగెత్తారు; నేను తల కిటికి బయటకుపెట్టి నుంచున్నాను. కొంతదూరం వరకూ వాళ్లు చేతులతో ఊగిస్తున్న జేబురుమాళ్ళు కని పించాయి. క్రమంగా ఆ రేఖలు శూన్యంలో విలీన మయినాయి. కాని ఒక సన్నని వ్యక్తి యింకా ప్లాట్‌ఫారంపైనే నిలబడి ఉన్నాడు. నేను గుర్తించాను; అతను సూర్యప్రకాశే! ఆ సమయంలో నా హృదయం వ్యాకులపడుతున్న ఖైదీవలె ద్వేషం, మనస్పర్థ, ఉదాసీనతల బంధనా లన్నీ త్రెంచుకుని అతన్ని కౌగలించుకోవాలని తహతహలాడిపోయింది.

క్రొత్తప్రదేశపు క్రొత్తసమస్యలు అనతికాలంలోనే నన్ను తమ వైపుకు ఆకర్షించుకున్నాయి. గడచినరోజుల స్మృతులు తీరని కోరికలు గానే ఉండిపోయినాయి. ఎవరూ నాకు జాబు వ్రాయలేదు. నేనూ ఎవరికీ వ్రాయలేదు. బహుశా లోకపుతీరే యింతేమో! వర్షాకాలం దాటిపోయిన తరువాత, ఆ కాలపు పచ్చదనం ఎన్నాళ్లుంటుంది! తల వని తలంపుగా నాకు విద్యాభ్యాసానికి యింగ్లండు వెళ్ళే అవకాశం లభించింది. అక్కడ మూడు సంవత్సరాలు గడిచినాయి. అక్కడనుండి రాగానే నన్ను ఒక కాలేజీకి ప్రిన్సిపాల్‌గా నియమించారు. నేను ఆశించిన దానికంటె అధికంగా కలిసివచ్చింది. నేను స్వప్నంలో గూడా ఇంతదూరం ఊహించలేదు. కాని నా పదవీ వ్యామోహం యిప్పుడు మరింత ఉన్నతస్థానాన్ని పొందాలని ఉవ్విళ్ళూరు తోంది. విద్యాశాఖామంత్రితో సంబంధా లేర్పరచు కున్నాను. మంత్రిగారు నన్ను బాగా ఆదరించేవారు. కాని, విద్యకు సం బంధించిన మూలసిద్ధాంత పరిజ్ఞానం ఆయనకు శూన్యం. ఇక ఆయన తన భారమంతా నాకు వప్పగించేశారు. గుర్రాన్ని అధి రోహించింది వారే అయినా, కళ్ళెం నా చేతిలోనే ఉండేది. దాని ఫలితంగా ఆయన రాజకీయ ప్రతిపక్షులందరూ నాకు విరోధు లైనారు. ఇక వాళ్ళంతా అయినదానికీ కానిదానికీ నామీద దాడి చేసేవాళ్ళు. నేను సైద్ధాంతికంగా నిర్బంధ విద్యా విధానానికి ప్రతి

కూలుణ్ణి. తనకు ప్రత్యేకంగా సంబంధించిన విషయాల్లో ప్రతి మాన వుడికీ యితోధికంగా స్వతంత్రం ఉండాలని నా అభిప్రాయం. నిర్బంధ విద్యావిధానవు అవసరం యూరపు ఖండాని కుందిగాని, భారతదేశా నికి లేదని నా అభిప్రాయం. భౌతికతత్వం పాశ్చాత్య సభ్యతకు మూలాధారం. అక్కడ ఏపనైనా ఆర్థిక ప్రయోజనాల దృష్ట్యానే చేస్తారు. అక్కడ జీవితావసరాలుకూడా యెక్కువ. అందువల్ల జీవన సంగ్రామం కూడా భీషణంగానే ఉంటుంది. తల్లిదండ్రులు కూడా విలాసాలకు దాసులై, పిల్లలు సాధ్యమైనంత త్వరలో సంపాదన పరులయ్యేట్లుగానే చూస్తారు. తమ విలాసాలను తగ్గించుకుని, రోజుకొక షిల్లింగ్ మిగుల్చుకునేందుకు బదులు, తమ చిన్న పిల్లవాణ్ణి ఒక షిల్లింగ్ కూలి సంపాదించుకురమ్మని వత్తిడి పెడతారు. భారతీయ జీవితంలో సాత్వికమైన సరళస్వభావముంది. మనం పరి స్థితులవల్ల తప్పనిసరి అయితే తప్ప మన పిల్లలను కూలికి పంపించం. నిష్ఠదరిద్రుడైన భారతీయ కార్మికుడుగూడా విద్యవల్లకలిగే ప్రయో జనం అర్థం చేసుకున్నవాడే. తన కొడుకు కూడా నాలుగు అక్షరం ముక్కలు నేర్చుకోవాలనే అభిలాష అతనికీ ఉంటుంది. అతనలా కోరుతున్నాడంటే తన కొడు కేదో అధికారైపోతాడని కాదు; విద్య మానవశీలానికి ఒక అలంకారం కాబట్టి. ఈ సంగతి తెలిసి కూడా తన కొడుకు నతడు స్కూలుకు పంపటంలేదంటే విధిలేకనే అన్న విషయం అర్థం చేసుకోవాలి. అటువంటిస్థితిలో అతని మీద చట్టం పేరుతో దాడి చేయటం నా దృష్టికి న్యాయసమ్మతంగా లేదు. అదీ గాక, మన దేశంలో యింకా యోగ్యులైన ఉపాధ్యాయులు లేరని నా అభిప్రాయం. సరియైన శిక్షణలేని, అల్పవేతనాలు పొందే ఉపా ధ్యాయులు ఏవో ఉన్నతాదర్శాలతో పని చేయగల్గుతారని ఎవరూ ఆశించలేరు. మహా అయితే నాలుగైదు సంవత్సరాల్లో పిల్లవాడికి అక్షరజ్ఞానం కలుగుతుందేమో! అంతే! ఇది కొండను తవ్వి ఎలు కనుపట్టినట్లవుతుందని నా అభిప్రాయం. వయోజనులైన తరువాత ఈ సమస్య ఒక మాసంలో పరిష్కరించగలం. పెద్దవాళ్ళయిన తరు వాత ఒక నెలలో సంపాదించగలిగే జ్ఞానం చిన్నతనంలో మూడు

సంవత్సరాలకుకూడా సాధించలేము. అనవసరంగా పసివాళ్ళను పాఠశాలల్లో నిర్బంధిస్తే లాభమేమిటి? పాఠశాల బయట స్వచ్ఛమైన గాలి లభిస్తుంది. ప్రాకృతిక అనుభవం గలుగుతుంది. పాఠశాలల్లో బంధించి మానసికంగానూ, శారీరకంగాను. రెండిందాలా వాళ్ళను భ్రష్టు పట్టిస్తున్నాం. అందువల్లనే రాష్ట్ర కార్య నిర్వాహకుల సమావేశంలో నిర్బంధవిద్యా తీర్మానం ప్రతిపాదించినప్పుడు, నా ప్రోత్సాహంతో మంత్రిగారు దాన్ని ప్రతిఘటించారు. దాని ఫలితంగా తీర్మానం నిరాకరింపబడింది. ఇం కేముంది? మంత్రిగారికి, నాకూ ఉన్న లావాదేవీలను గురించి ఎలాంటి దుమారం రేగిందో చెప్పనక్కర లేదు. వ్యక్తి గతమైన ఆరోపణలు చెలరేగినాయి. పేదవాడి పెళ్ళాం స్థితిలో ఉన్నది నేనేగా! అందుకనే అందరికీ నేనే వదినను కావలసివచ్చినది. నన్ను దేశద్రోహి, అభ్యుదయ నిరోధకుడు, అధికారుల తొత్తు అని నిందించటం మొదలైంది. నా కాలేజీలో ఏ చిన్న విషయం జరిగినా, కౌన్సిల్ సమావేశంలో నాపైన విరుచుకుపడేవాళ్లు. నే నొక బంట్రోతును డిస్‌మిస్ చేశాను. కౌన్సిలు సభ్యులంతా పంజాలువిప్పి నా వెంటపడ్డారు. చివరకు మంత్రిగారు గత్యంతరం లేక ఆ బంట్రోతును తిరిగి నియమించవలసివచ్చింది. ఈ అవమానాన్ని నేను సహించలేక పోయాను. బహుశా ఎవరైనా సహించలేరేమో! ఇందులో మంత్రిగారి దోషమేమీ లేదు. అయనకు తప్పనిసరైంది. ఇక ఆ వాతావరణంలో పనిచెయ్యటం నాకు అసాధ్యమైపోయింది. నాకు కాలేజీ నిర్వాహణలో గూడా అధికారం లేకుండాపోయింది. 'ఫలానావాణ్ణి పరీక్ష కెందుకు పంపించారూ?' 'ఉపకారవేతనం ఫలానావాడికి బదులు ఫలానావాడికి ఎందుకివ్వలేదు?' 'ఫలానా ఉపాధ్యాయుడికి ఫలానాక్లాసు ఇవ్వక పోవటానికి కారణమేమిటి?' – ఇలాంటి సారహీనమైన ఆరోపణలతో నాకు విసుగెత్తి పోయింది. ఈ కొత్త గాయంతో నా నడుములు విరిగిపోయాయి. నేను రాజీనామా ఇచ్చేశాను.

కనీసం యీ విషయంలోనైనా మంత్రిగారు తప్పకుండా న్యాయదృష్టితో పని చేస్తారని ఆశించాను. కాని వారు న్యాయానికి

బదులు రాజనీతిని గౌరవించారు. అనేక సంవత్సరాల నా భక్తి విశ్వాసాలకు ఫలితంగా, నన్ను పదవినుండి తొలగించటం జరిగింది. లోకాన్నిగురించి యిలాంటి అప్రియమయిన అనుభవం యింతవరకు ఎప్పుడూ కలుగలేదు. గ్రహస్థితికూడా బాగా లేదు. ఆ రోజుల్లోనే నా భార్య కూడా చనిపోయింది. చివరిసారి ఆమెను చూడలేక పోయాను. సాయంత్ర మప్పుడు ఏటిఒడ్డుకు షికారుకు వెళ్ళాను. ఆమెకు కాస్త సుస్తీగాఉంది. తిరిగి నేను వచ్చేసరికి శవం లభించి ది. బహుశా గుండె ఆగిపోయిం దనుకుంటాను. ఈ గాయం నన్ను కుంగదీసింది. తల్లియొక్క అనుగ్రహ ఆశీర్వాదాలతో గొప్ప గొప్ప మహా పురుషు లనేకమంది కృతార్థులయినారు. నేను సాధించిం దేమైనా ఉంటే, అందుకు నా భార్య అనుగ్రహ ఆశీర్వాదాలే కారణం. ఆమే నాఅదృష్టానికి విధాత్రి. ఎంత అలౌకికత్యాగమూర్తి! ఎంత అచం చల ధైర్యలక్ష్మి! ఆమె మధురస్వభావంలో అసహనం ఎన్నడూ లేదు. ఆమెకు ఎన్నడూ కోపం రాగా చూచినట్లు జ్ఞాపకమే లేదు. నిరాశ అంటే ఏమిటో అసలు ఎరగనే ఎరుగదు. నేను చాలాసార్లు పెద్ద జబ్బున పడ్డాను. వైద్యుడుకూడా ఆశ వదులుకున్నాడు. కాని ఆమె అణుమాత్రం కూడా అధైర్యపడలేదు. స్థిమితాన్ని కోల్పోలేదు. తన భర్త జీవించి ఉండగానే, తాను కన్నుమూస్తానని విశ్వాసం. జరిగింది కూడా అదే. ఇంతవరకూ జీవితం ఆమె నాధారంచేసుకునే గడిపాను. జీవితాధారమే నశించిపోయిన తరువాత ఇక జీవిత మేముంది! తినడమూ, నిద్రపోవటమూ కాదు జీవితమంటే. నిరంతరం ముందుకు నడవాలనే పట్టుదలకు మరో పేరే జీవితం. ఇప్పుడా పట్టుదల మాయమైపోయింది. నాకు లోకమంటే విరక్తి ఏర్పడింది. ఇక మిగతా జీవితకాలం ఏకాంతంగా గడుపుదామని నిశ్చయించుకుని ఒక కుగ్రామానికి వెళ్ళి నివసించసాగాను. ఊరికి నలువైపులా ఎత్తయిన దిబ్బలే. ఒకప్రక్క గంగానది ప్రవహిస్తూంది. నేను నది వొడ్డున ఒక చిన్న యిల్లు కట్టించుకున్నాను. అందులోనే నివసించసాగాను.

# 3

పని చేయటం మానవుని స్వభావం. నిరుద్యోగంతో జీవితం గడిచే దెలా? నే నొక చిన్న పాఠశాల ప్రారంభించాను. ఒక చెట్టు నీడను గ్రామంలో పిల్లలను పోగుచేసి చదువు చెబుతుండే వాణ్ణి పాఠశాల ఖ్యాతి బాగా వ్యాపించింది. సమీప గ్రామంనుండి గూడా పిల్లలు రాసాగారు.

ఒకరోజు నేను నా క్లాసులో పాఠం చెబుతున్నాను. ఇంతలో పాఠశాలవద్దకు ఒక కారువచ్చి ఆగింది. అందులోనుండి జిల్లా డిప్యూటీ కమీషనరు దిగాడు. అప్పుడు నేను చొక్కా, ధోవతి మాత్రమే ధరించి ఉన్నాను. ఈ వేషంతో ఒక అధికారిని కలుసుకోటానికి సిగ్గు పడుతున్నాను. ఆయన నా దగ్గరకు రాగానే నేను సిగ్గుపడుతూ చెయ్యి జాచాను. కాని ఆయన నాకు షేక్‌హాండ్ ఇవ్వటానికి బదులు, నా పాదాలమీద వాలి తల వాటిమీద ఆనించాడు. నే నెంతో గాబరా పడిపోయాను. నోటినుండి ఒక్క మాటైనా పెగల లేదు. నేను మంచి ఇంగ్లీషు వ్రాస్తాను. దార్శనికశాస్త్రం లో గూడా నేను ప్రొఫెసరును. ఉపన్యాస కళలో కూడా ఆరితేరినవాణ్ణే. కాని ఇవేవీ భక్తి ప్రదర్శించవలసిన గుణాలు కావు. భక్తి ప్రదర్శించటానికి యోగ్యులు, సాధులూ, జ్ఞానులూ మాత్రమే. పోనీ నేను బ్రాహ్మణుడ నయినా అయివుంటే పరవాలేదు. ఎందువల్లనంటే ఒక పౌరుడు బ్రాహ్మణుని పాదాలకు మొక్కటంలో విచారపడవలసిం దేమీ లేదు.

నే నింకా విస్మయావస్థలోనే ఉన్నాను. ఇంతలో డిప్యూటీ కమీషనరు తలయెత్తి నావైపు చూచాడు, "బహుశా మీరు నన్ను గుర్తించ లేదనుకుంటాను" అన్నాడు.

ఆ మాట వినేసరికే నాకు జ్ఞాపకం వచ్చేసింది: "మీ పేరు సూర్యప్రకాశ్ కదూ!" అన్నాను.

"చిత్రం! ఆనాటి మీ తుంటరి శిష్యుణ్ణే!"

"పన్నెండు పదమూడేళ్ళయింది."

"ఉపాధ్యాయులు విద్యార్థులను మరిచిపోతారు. కాని విద్యార్థులు మాత్రం వారిని ఎన్నటికీ మరచిపోరు" చిరునవ్వుతో అన్నాడు సూర్యప్రకాశ్.

"మీవంటి విద్యార్థులను మరచిపోవటం మాత్రం అసంభవం" నేనూ పరిహాసంగా అన్నాను.

"ఆనాటి అపరాధాలకు క్షమాపణ వేడుకోటానికే మీ సన్నిధికి వచ్చాను. నేను అకారణంగా మిమ్మల్ని వేధించేవాణ్ణి. మీరు ఇంగ్లండుకు వెళ్లినప్పుడు, నేను మీకు అభినందన లేఖకూడా వ్రాశాను. కాని అది మీకు పంపలేకపోయాను. మీరు ప్రిన్సిపాల్ అయినప్పుడు, నేను ఇంగ్లండుకు వెళ్ళబోతున్నాను. అక్కడ పత్రికల్లో నేను మీ వ్యాసాలు చదివేవాణ్ణి. నేను తిరిగి వచ్చేసరికి మీరు రాజీనామా యిచ్చేశారనీ, ఎక్కడో పల్లెటూరికి వెళ్లిపోయారనీ తెలిసింది. నేనీ జిల్లాకు వచ్చి ఒక సంవత్సరానికి ఎక్కువే అయింది. కాని మీరిక్కడ ఏకాంతవాసం చేస్తున్నారని ఆవంతయినా అనుమానించలేదు. ఈ పాడుబడ్డ ఊళ్ళో మీ కెలా తోస్తున్నది? ఈ వయసులోనే మీరు వానప్రస్థాశ్రమం స్వీకరించారే?"

సూర్యప్రకాశ్ అభివృద్ధి చూచి నా కెంతటి ఆశ్చర్యానందాలు కలిగాయో వర్ణించలేను. అతను నా కుమారుడైనా ఇంతకు మించిన ఆనందం కలిగేదికాదు. అతన్ని నేను నా కుటీరంలోకి తీసుకువెళ్లి నా కథంతా చెప్పాను.

"అయితే మీరు మీ సోదర వ్యక్తియొక్క విశ్వాసఘాతుకానికే ఎరఅయినారన్నమాట! నా అనుభవం ఇంకా పరిమితమైందే. కాని ఈ కొద్ది దినాల్లోనే మన కింకా మన బాధ్యతలను నిర్వర్తించుకోటం చేతకాలేదని అర్థమైపోయింది. మంత్రిగారిని కలుసుకున్నప్పుడు యిదేనా మీ ధర్మమని అడుగుతాను" అన్నాడు సూర్యప్రకాశ్.

"భాయీ! ఇందులో ఆయన దోష మేమీ లేదు. ఆ పరిస్థితిలో నేనూ ఆ పనే చేసేవాణ్ణేమో. నా స్వార్థ దాహానికి తగిన శిక్ష లభించింది. అందుకు నేను ఆయనకు రుణపడ్డాను. ఇది పైకి అనే మాట కాదు. నిజం చెబుతున్నాను. నా కిక్కడున్న శాంతి మరెక్కడా లేదు. ఈ ఏకాంత జీవితంలో జీవితరహస్యాలను అర్థంచేసుకున్నాను. ఇలాంటి జ్ఞానం ధనంవల్లగానీ, అధికారంవల్లగానీ లభించటం అసంభవం. చరిత్ర, భూగోళగ్రంథాల పన్నాలన్నీ జీర్ణం చేసుకున్నా, యూరపియన్ విశ్వవిద్యాలయాల శరణుజొొచ్చినా, నా మమకారాన్ని చంపుకోలేక పోయాను. అంతే కాదు. ఈ వ్యాధి అంతకంతకు అసాధ్యమౌతూ వచ్చింది. మెట్లమీద కాలుపెట్టకుండానే పై అంతస్థులు చేరుకోగలమా? సంపత్తి మహలుకు చేరుకోవటానికి ఇతరుల జీవితాలే మెట్లుగా ఉపయోగపడతాయి. ప్రక్కవాళ్ళను అణచివేస్తేనే లక్ష్యం వరకూ చేరుకోటం సాధ్యం. ఈ విషయంలో సౌజన్యానికి, సానుభూతికి స్థానం లేదు. ఆ కాలంలో నేను క్రూర జంతువుల ముట్టడిలో చిక్కినట్లు దేది. అప్పుడు నా సర్వశక్తులూ ఆత్మరక్షణకే వినియోగమయ్యే వనిపిస్తుంది ఇక్కడ నాకు నలువైపులా సంతృప్తి, నిరాడంబరత్వం కనిపిస్తున్నాయి. నావద్దకు వచ్చే జనం ఏదో స్వార్థంకోసం రారు. నా సేవగూడా పొగడ్తలూ, సన్మానాల దాహం తీర్చుకోటానికి కాదు."

ఇలా అని నేను సూర్యప్రకాశ్ ముఖంవంక ధ్యానంతో చూచాను. కపట మందహాసానికి బదులు విషాద రేఖలు కనిపిస్తున్నాయి. "మీ రెంతగానో నిరాశులైన వ్యక్తి... చూచారా! నేడు ఎలాంటి పదవిలో కొచ్చాడో" అని బహుశా నాకు చూపించటానికే వచ్చివుండవచ్చు. అతను నానుండి కోరేది తన కృషినిగురించి ప్రశంస. అప్పుడు నాపొరపాటు నా కర్థమైంది. ఒక భాగ్యశాలిముందు సంపదను నిదించటం భావ్యంకాదు. వెంటనే నేను సంభాషణమార్చి 'మరి నీసంగతేమిటో చెప్పూ! నీలో ఈ విప్లవం ఎలా సంభవించినట్లూ! నీ పోకిరీ పనులు జ్ఞప్తికి తెచ్చుకుంటే యిప్పటికీ భయం వేస్తుంది. ఏ దేవతైనా

వరం ప్రసాదిస్తే తప్ప మరో విధంగా ఈ అభివృద్ధి సాధ్యమయ్యేది కాదుసుమా!' అన్నాను.

'అదంతా మీ ఆశీర్వాద ఫలితం' చిరునవ్వుతో అన్నాడు సూర్యప్రకాశ్.

నే నెంతో బలవంతంచేసినమీదట తనవృత్తాంతం వినిపించటం మొదలు పెట్టాడు — 'మీరు వెళ్ళిపోయిన తరువాత చాలా రోజులకు మా మేనల్లుడు స్కూలులో ప్రవేశించాడు. అతని వయస్సు ఎనిమిది లేక తొమ్మిదేళ్ళకు మించదు. ప్రిన్సిపాలుగారు అతన్ని హాస్టలులో ఉండటానికి అంగీకరించలేదు. మా మామయ్యగారు అతనికి ప్రత్యేకంగా వసతిని ఏర్పాటుచేసే స్థితిలో లేరు. ఆయన యిబ్బందిని కనిపెట్టి, ప్రిన్సిపాల్‌గారి వద్దకు వెళ్ళి 'అతన్ని నా గదిలో ఉండనివ్వండి' అన్నాను. ప్రిన్సిపాల్‌గారు అలా ఉంచటం రూల్స్‌కు వ్యతిరేకమన్నారు. అందుకు కోపమొచ్చి, ఆ రోజే నేను హాస్టలు వదిలిపెట్టాను. ఒక అద్దెయిల్లు తీసుకుని మోహన్‌తో కలసి అక్కడే ఉండసాగాను. వాళ్ళమ్మ చాలా సంవత్సరాలకు పూర్వమే చని పోయింది. సన్నగా, బక్కపలుచగా, అమిత బలహీనంగా ఉండే ఆ అర్భకుణ్ణి చూస్తే నాకు మొదటిరోజునే అతనంటే ఎంతో జాలి ఏర్పడింది. ఒకప్పుడు తల నొప్పి, మరొకప్పుడు జ్వరం ఈ విధంగా నిత్యం ఏదో ఒకబాధ ఉంటూనే ఉండేది. ప్రొద్దుగూకటమే తరు వాయి; కునికిపాట్లు పడుతుండేవాడు ఎంతో కష్టం మీద భోజనానికి లేచేవాడు. ప్రొద్దెక్కిందాకా నిద్రపోయేవాడు. నేను ఒడిలోకి తీసు కుని కూర్చోబెట్టుకునేవరకూ లేవాలనే తలంపే ఉండేదికాదు; రాత్రిపూట తరుచుగా ఉలిక్కిపడి, నా మంచం మీదికి వచ్చి నా మెడలో చెయ్యివేసి అనుకుని పడుకునేవాడు. అతనిమీద నా కెప్పుడూ కోపం వచ్చేదికాదు. అతనంటే నాకంత ప్రేమ ఎందుకేర్ప డిందో నేను చెప్పలేను. అదివరకు రోజూతొమ్మిది గంటలకు నిద్రలేచే నేను, యిప్పుడు వేకువనే నిద్రలేచి అతనికోసం పాలు కాగపెట్టేవాణ్ణి. తరువాత అతన్ని లేపి, ముఖం కడిగించి టిఫిన్‌చేయించేవాణ్ణి. అతని ఆరోగ్యాన్ని దృష్టిలో ఉంచుకుని రోజూ షికారుకు తీసుకెళ్ళేవాణ్ణి.

ఎన్నడూ పుస్తకంబట్టి కూర్చోనివాణ్ణి అతన్ని గంటలతరబడి చదివించే వాణ్ణి. నా బాధ్యతను గురించి యింతటి పరిజ్ఞానం ఎలా కలిగిందో నాకే ఆశ్చర్యం. అతని కేమైనా సుస్తీ చేసిందంటే ప్రాణాలు పిడికిట్లోకి వచ్చేసేవి. డాక్టరువద్దకు పరుగెత్తి మందులు తెచ్చేవాణ్ణి. మోహన్‌కు మాయమాటలు చెప్పి మందులు త్రాగించేవాణ్ణి. ఎప్పుడూ అతనికి అయిష్టమైన విషయ మేదీ జరగకుండా చూడాలనే ఆలోచించేవాణ్ణి. పాపం యిక్కడ అతనికి నా కంటె దిక్కెవరు? నా పోకిరీమిత్రుల్లో ఎవరైనా వాడికి చిరాకు కలిగించటమో, రెచ్చగొట్టడమో చేశాడా నాకు చెప్పలేని కోప మొచ్చేది. చాలామంది కుర్రాళ్ళు నన్ను "అవ్వా అవ్వా!" అంటూ రెచ్చగొట్టేవాళ్ళు. కాని నేను నవ్వి ఓర్చుకునేవాణ్ణి అతని ఎదుట అనుచితంగా ఒక్క మాటగూడా అనేవాణ్ణి గాదు. నన్ను చూచి వీడుకూడా ఎక్కడ చెడిపోతాడోనని సందేహించేవాణ్ణి. అతను నన్ను తనకు ఆదర్శ వ్యక్తిగా భావించుకునే విధంగా అతని ఎదుట మెలగాలని వాంఛించే వాణ్ణి. అందుకు నాప్రవర్తనను సరిచేసుకోవట మొకటే మార్గమని అందరికీ తెలిసిందే. తొమ్మిది గంటలకు నిద్రలేవటం, పదకొండు గంటలదాకా అడ్డాలు తిరగడం, కొత్తకొత్త పోకిరీపనులకు పన్నాగాలు పన్నటం, ఉపాధ్యాయుల కళ్ళుగప్పి స్కూలునుండి పారిపోవటం - యీ అలవాట్లన్నీ వాటంతటవే అంతరిస్తూ వచ్చాయి. ఆరోగ్యం, సత్ప్రవర్తన యిలాంటి సిద్ధాంతాలకు నేను బద్ధశత్రువును. కాని యిప్పుడు ఆ నియమాలను పాటించటంలో నాకు మించినవాడెవడూ లేడు. నేను భగవంతుడంటే పరిహసించేవాణ్ణి. కాని యిప్పుడు పక్కా ఆస్తికుణ్ణయినాను. "భగవంతుడు అన్నిచోట్లా ఉంటారంటారుగదా; నా దగ్గర కూడా ఉంటాడుగదూ?" అమాయకంగా ప్రశ్నించేవాడు మోహన్. ఈ ప్రశ్నను ఎగతాళిగా త్రోసివేయటం నా వల్లయ్యేపని కాదు. ఔను! భగవంతుడు నీ వద్ద, నావద్ద, అందరివద్ద ఉంటూ, మనలను కాపాడుతూ ఉంటాడు" అనే వాణ్ణి. ఈ ధీమాతో అతని వదనం ఆనందాతిశయంతో వికసించేది. బహుశా అతని కప్పుడు భగవంతుని శక్తి అవగాహ నయ్యేదేమో!

ఒక్క సంవత్సరంలోనే మోహన్ ఎంతో మారిపోయాడు. మా మామ గారు మళ్ళీ వచ్చి చూచేసరికి ఆశ్చర్యపడ్డారు. కళ్ళ నీళ్ళు పెట్టుకుని, "నాయనా! నువ్వు వీణ్ణి బ్రతికించావోయ్. నేను వీణ్ణి గురించి ఆశే వదులుకున్నాను. దీనికి తగిన పుణ్యఫలం భగవంతుడు నీకు ప్రసాదిస్తాడు నాయనా! వీళ్ళమ్మ స్వర్గంలో వుండి నిన్ను ఆశీర్వదిస్తోంది బాబూ!" అన్నాడు.

సూర్యప్రకాశ్ నేత్రాలు ఆ సమయంలో కూడా సజలమైనాయి.

"మోహన్ కూడా నిన్ను ఉచితంగా ప్రేమించేవాడను కుంటాను?" ప్రశ్నించాను నేను.

సూర్యప్రకాశ్ సజలనేత్రాల్లో దైన్యంతో కూడిన ఆనందం మెరిసిపోతోంది. "అతను నన్ను ఒక్క క్షణంకూడా వదిలేవాడు కాదు. నా ప్రక్కనే కూర్చునేవాడు నాతోపాటే భోంచేసేవాడు. నాతో పాటుగానే నిద్రపోయేవాడు. అతనికి సర్వస్వం నేనే. ఓహ్. అతనీ లోకం వదిలిపోయాడు, కాని నాకుమాత్రం అతను యిప్పుడూ జీవితుడే. నేనింతవాణ్ణి కావటానికి అతనే కారణం. దైవ నిర్ణయం లాగా అతను నాకు మార్గదర్శకుడై ఉండకపోతే, యివ్వాళ నేనే జైలులోనో పడిఉండేవాణ్ణే. ఒకనాడు నేను "నువ్వు రోజూ స్నానం చెయ్యకపోతే నేను నీతో మాట్లాడను" అన్నాను. స్నానంఅంటే అతనెందుకో అమితంగా బద్ధకించేవాడు. నా బెదిరింపు ఫలితంగా అతను ప్రతినిత్యం ప్రొద్దున్నే స్నానం చేసేవాడు. ఎంత చలిగాఉన్నాసరే; ఈదురుగాలి వీస్తున్నాసరే స్నానంమాత్రం తప్పక చేసేవాడు. నన్ను సంతోషపెట్టేదెలాగా అనే ఆలోచనలోనే ఉండేవాడు. ఒకనాడు నేను స్నేహితులతోపాటు సినిమాకు వెళ్ళాను. నువ్వు భోంచేసి నిద్రపొమ్మని హెచ్చరించి మరీవెళ్ళాను. రాత్రి మూడుగంటలకు మళ్ళీ వచ్చి చూస్తే అతను నిద్రపోకుండా కూర్చునే ఉన్నాడు. "నిద్రపోలేదేం?" అన్నాను. నిద్ర పట్టలేదన్నాడు. ఆ రోజునుండి నేను సినిమాకు వెళ్ళటమే మానివేశాను. పిల్లలెప్పుడూ సహజంగా ఒకరకమైన ప్రేమదాహానికి లోనైయుంటారు. పాలూ, మిఠాయిలు, బొమ్మల

కంటేకూడా మత్తు కలిగించే దా దాహం. తల్లి ఒడిముందు ప్రపంచం లోని సమస్త ఐశ్వర్యాన్ని తృణీకరింపచేసే దా దాహం! మోహన్‌లో ఉన్న ఆదాహం ఎన్నటికీ చల్లారేది కాదు. పర్వతాలను ఢీకొనే హంస గానం లాగా అది ఎల్లప్పుడూ నరనరాల్లో ప్రతిధ్వనిస్తూనే ఉండేది. భూమిమీద అల్లుకున్న లతకు ఏదైనా ఆధారం లభించగానే, దానికి చుట్టుకుంటుంది లత. సరిగ్గా అలాగేవుంది మోహన్ స్థితి. నానుంచి గనక వేరుచేస్తే, ఆ కోమలమైన లత తునాతునకలై పోతుందేమో నన్నంతగా అతను నాతో మిళితమైనాడు. నాతోపాటు మూడు సంవత్సరా లున్నాడతను. నా జీవితంలో వెలుగురేఖలు చిమ్మి తాను అంధకారంలో విలీనమైపోయినాడు. ఆ శిధిల దేహంలో ఎన్నెన్ని కోర్కెలున్నాయో! బహుశా భగవంతుడు నా జీవితాని కొక ఆలంబ నను సృష్టించటంకోసమే అతన్ని పంపించాడేమో. ఆశయం ఫలించిన తరువాత యింకా అతను ఎందుకుంటాడు!

## 4

వేసవిశెలవు సెలవులిచ్చారు. గత రెండుసంవత్సరాల వేసవి సెలవుల్లో మోహన్ నావద్దనే ఉన్నాడు మా మామయ్య బలవంతం చేసినా యింటికి వెళ్ళలేదు. ఈ సారి కాలేజీ విద్యార్థులందరూ కాశ్మీర్ యాత్రకు వెళ్ళటానికి నిశ్చయించుకుని, దానికి నన్ను అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. కాశ్మీర్ యాత్రకు వెళ్లాలని నాకూ ఎన్నాళ్ళనుండో కోరిక. ఈ అవకాశం వచ్చినందుకు మహా సంతోషించాను. మోహన్ను మామగారింటికి పంపించి, నేను కాశ్మీర్‌కు వెళ్ళిపోయాను. తిరిగి రెండు నెలలకు వచ్చాను. మోహన్‌కు జబ్బుగా ఉందని తెలిసింది. కాశ్మీర్‌లో నాకు మాటిమాటికీ తలపు కొచ్చేవాడు మోహన్. తిరిగి వెళ్ళిపోదా మనిపించేది. అత నంటే నా కింత ప్రేమని కాశ్మీర్ వెళ్లిన తరువాత అర్థమైంది. కాని మిత్రులు నన్ను విడిచిపెట్టలేదు.

అతను జబ్బుగావున్న వార్త వినగానే వ్యాకులపడిపోయాను. వచ్చిన మరురోజే అక్కడికి చేరుకున్నాను. నన్ను చూడగానే అతని పసుపు పచ్చని శుష్కించిన వదనంలో ఆనందం వెల్లివిరిసింది. నేను పరుగెత్తి అతనిని కౌగలించుకున్నాను. అతని నేత్రాల్లో స్వేచ్ఛా విహారంచేస్తున్న మత్యువుకు సూచనగా అలౌకికమైన తేజస్సు తాండవిస్తోంది. 'ఇలా అయిపోయినా వేమిటి మోహన్! రెండు మాసాల్లోనే యిలా ముంచు కొచ్చిందేం బాబూ!' ఆవేశపూరితమైన కంపిత స్వరంతో ప్రశ్నించాను నేను. 'నువ్వు కాశ్మీర్‌కు షికారుకు వెళ్ళావు. నేను ఆకాశంలో షికారుకు వెళ్తున్నాను' అమాయకమైన చిరునవ్వుతో అన్నాడు మోహన్.

'ఈ విషాదగాథంతా చెప్పి దుఃఖించాలనీ, దుఃఖపెట్టాలనీ లేదు నాకు. నేను కాశ్మీర్ వెళ్ళిపోయిన తరువాత ఏదో తపస్సు చేస్తున్నాడా అన్నంతగా కష్టపడి చదవసాగాడు మోహన్. సంవత్సరం చదువూ రెండు మాసాల్లో చదివెయ్యాలనీ, స్కూల్ తెరవగానే ఈ శ్రమకు ఫలితంగా నానుండి ప్రశంసాచిహ్నమైన బహుమానం పొందాలనీ అతనికో వెర్రి ఆవేశం పట్టుకుంది. 'నేనతన్ని ఏ విధంగా హుషారుచేస్తానో! ఎలా మెచ్చుకుంటానో! నా మిత్రులతో తనను గురించి ఏవిధంగా వర్ణిస్తానో!' యిలాంటి ఆలోచనలు అతని బాలోచిత ఉత్సాహం, తన్మయత్వాలతో మిళితమై, అతన్ని వశీకరించుకున్నాయి. మామగారికి వారి ఆఫీసు పనుల వత్తిడిలో అతని అహ్లాదాన్ని గురించి శ్రద్ధతీసుకోటానికి అవకాశమెక్కడుంటుంది? ఆయన బహుశా కుర్రాడు నిత్యం ఏదో ఒకటి చదువుతుండటం చూచి, మనసులో సంతోషిస్తుండేవాడు. అతనేమైనా ఆటలాడుతూఉంటే తప్పకుండా మందలించేవాడే. చదువుకుంటుంటే ఆయనమాత్రం ఏమంటాడూ! దాని ఫలితంగా మోహన్‌కు కొద్దిగా జ్వరం తగులుతూ వచ్చింది. ఆ స్థితిలోగూడా అతను చదవటం మానలేదు. వరుసగా మరికొన్ని అవకతవకలుగూడా జరిగినాయి. జ్వరం యింకా ప్రకోపించింది. ఆ స్థితిలోకూడా జ్వరం కాస్త తగ్గితేసరి, ఏదో పుస్తకం చూడటం ప్రారంభించేవాడు. అతని ప్రాణాలన్నీ నామీదే ఉండేవి.

జ్వరస్థితిలో కూడా "ప్రకాశ్ బావనుంచి జాబేమైనా వచ్చిందా? బావ ఎప్పుడొస్తాడూ?" అని నౌకర్లను ప్రశ్నించేవాడు. ఇది తప్పితే మరో కోరికే ఉండేదేకాదు. నా కాశ్మీర్ యాత్రకు యింత మూల్యం చెల్లించవలసి వస్తుందనుకుంటే అక్కడికి వెళ్ళాలనుకునేవాణ్ణి కాదు. అతన్ని కాపాడటానికి నేను చెయ్యగలిగిందంతా చేశాను. కాని అది టైఫాయిడ్ జ్వరం. అతని ప్రాణాలు తీసిమాత్రమే వదిలిం దది. అతని జీవితస్వప్నాలు ఎవరో మహర్షి ఆశీర్వాదాలై నాకు ప్రోత్సాహ మిచ్చాయి నన్ను మీరు ఈ దశలో చూడగలగటానికి ఆ ప్రేరణే కారణం. మోహన్ చిన్ననాటి అభిలాషలను వాస్తవికం చేసినందుకు నాకొక తృప్తిగాఉంది. మోహన్ పవిత్రాత్మ నన్ను చూచి ఆనందిస్తోం దన్న విశ్వాసమే నా కా తృప్తినిస్తూంది. ఆ ప్రేరణే అత్యంత క్లిష్టతర పరీక్షల్లోకూడా న న్నుద్ధరించింది. లేకుంటే నేను ఈ రోజుకూ మీరు చూడటానికి కూడా ఏవగించుకునె ఆ మొద్దు సూర్యప్రకాశ్‌ను గానే ఉండిపోయేవాణ్ణి."

ఆ నాటినుండి నేను అనేకసార్లు సూర్యప్రకాశ్‌ను కలుసుకున్నాను. అత నావైపుకు వస్తే నన్ను కలవకుండా వెళ్ళేవాడు కాదు. ఇప్పటికీ అతను మోహన్‌ను తన యిష్టదైవంగానే భావిస్తాడు. ఈ నాటి వరకూ మానవ మనస్తత్వంలో నేను అర్థం చేసుకోలేకపోయిన ఒకానొక పరమ రహస్య మిది.

# శేరుంబావు గోధుమలు

అనగా అనగా ఒక ఊళ్ళో శంకర్ అనే కుర్మీజాతి రైతు ఉండేవాడు. కల్లాకపట మెరుగని పేదవా డతను. తన పనేమో తానేమో, ఒకడికి తానొక కానీ యివ్వనక్కరనూ లేదు. ఒక డొక కానీ తనకూ యివ్వనక్కరలేదు. మడత పేచీలు పెట్టటం అంటే ఏమిటో ఎరుగడు. మోసం, కపటం అతనిలో కలికానికికూడా కానరావు. మోసపోతానేమోనన్న భయమే ఎరుగడు. మోసం చెయ్యటం అసలే చేతకాదు. ఉంటే భోంచేసేవాడు. లేకుంటే ఏ సెనగలో కాసిని తిని ఊరుకునేవాడు. అవ్వీ లేకపోతే, బొక్కెడు నీళ్ళు త్రాగి 'రామా, కృష్ణా' అంటూ పడుకుని నిద్రపోయేవాడు. కాని ఎవరైనా అతిథి గడపలోకి వస్తేమాత్రం ఈ వైరాగ్యం వదులుకోవలసి వచ్చేది. ముఖ్యంగా సాధువులూ, మహాత్ములూ రావటం సంభవిస్తే మాత్రం తప్పనిసరిగా అతను యిహలోక విషయాలకు దాసోహ మనాల్సి వచ్చేది. తానైతే ఆకలితో పడుంటాడుగాని, సాధువుల నెలా పస్తు పెడతాడూ? వాళ్ళు కేవలం భగవద్భక్తులాయిరి మరి!

ఒకనాడు సాయంత్రమప్పుడు ఒకసాధు వెవరో వచ్చి అతని వాకిట్లో పీఠంవేశాడు ఆయన ముఖంలో తేజస్సు తొణికిసలాడుతోంది. మెడలో పీతాంబరం, శిరస్సుపై జటాజూటం, చేతిలో యిత్తడి కమండలం, పాదాలకు పావుకోళ్ళూ, కళ్ళకు అద్దాలూ — వేషం అంతా అచ్చగా ఎట్లా ఉందనుకున్నారూ! శ్రీమంతుల మేడల్లో తపస్సూ, విమానాలమీద దేవస్థానాల సంచారం, యోగసిద్ధి సాధనకోసం షడ్రసోపేతమైన భోజనంచేస్తూ శ్రమించే మహాత్ములను స్మరణకు తెస్తోంది. ఇంట్లో జొన్నపిండి మాత్రముంది. అదెలా పెడతాడాయనకు. పూర్వకాలంలో జొన్నపిండి కెంత విలువైనా ఉంది. ఈ ఆధునిక యుగంలోమాత్రం జొన్నపిండి భోజనం సిద్ధులైన మహాత్ములకు జీర్ణం కావటం కష్టం. ఆ సాధు మహాత్మునికి ఏం పెట్టేదా అని ఎంతో బాధపడ్డాడు శంకర్—చివరకు ఎక్కడైనా గోధుమపిండి బదులు తెద్దామని నిశ్చయించుకున్నాడు. కాని ఊరంతా గాలించినా ఎక్కడా గోధుమపిండే దొరకలేదు గ్రామంలో ఉన్నవాళ్ళంతా కేవలం మనుష్యులు. దేవతలైనవాళ్ళు ఒక్కరూ లేరు. అలాంటప్పుడు దేవతలు ఆరగించే పదార్థాలు ఎలా లభిసాయి చెప్పండి? అదృష్టవశాత్తూ గ్రామ పురోహితునివద్ద కాసిని దొరికాయి. ఆయనవద్ద శేరుంబావు గోధుమలు (తూకం) అప్పుతెచ్చి పిండి విసరమన్నాడు భార్యను. ఆ మహాత్ముడు భోజనంచేసి హాయిగా నిద్రపోయాడు. ప్రొద్దున్నే లేచి శంకర్‌ను ఆశీర్వదించి తన దారిన వెళ్ళిపోయినాడు.

గ్రామ పురోహితుడైన ఆ బ్రాహ్మణ షావుకారు సంవత్సరానికి రెండుసార్లు మామూళ్ళు తీసుకునేవాడు. "శేరుంబావు గోధుమలు పనిగట్టుకుని ఏం తీసుకెళ్ళి యిస్తాంలే! ప్రతి సంవత్సరం మామూలుగా యిచ్చే అయిదుశేర్లకు బదులు ఇంకా కాసిని ఎక్కువ ముట్టచెబితే సరిపోతుంది. ఆయనా అర్థం చేసుకుంటాడు, మనకూ తృప్తిగా ఉంటుంది, అంతేలే!" అనుకున్నాడు శంకర్. చైత్రమాసంలో పురోహితుడు రాగానే, ఆయనకు ఏడున్నర శేర్ల గోధుమలు ముట్టజెప్పాడు. ఇక తన రుణం తీరిపోయిందని తృప్తిపడ్డాడు. దాన్నిగురించి మళ్ళీ ఎన్నడూ ఆలోచించలేదు. ఆ బ్రాహ్మణుడుకు కూడా మళ్ళీ

ఎన్నడూ ఆ విషయం ప్రస్తావించలేదు. ఆ శేరుంబావు గోధుమల బాకీ తీర్చుటంకోసం తాను తిరిగి మరో జన్మ ఎత్తవలసివస్తుందని పాప మా అమాయకుడు శంకర్‌కు ఏం తెలుసు!

## 2

ఏడు సంవత్సరాలు గడిచిపోయినాయి. గ్రామ పురోహిత బ్రాహ్మణుడు గ్రామ వడ్డీవ్యాపారస్థుడుగా మారిపోయినాడు రైతుగా ఉన్న శంకర్ కూలీ అయిపోయినాడు. అతని తమ్ముడు మంగళ్ అతని నుండి వేరుపడిపోయినాడు. ఇద్దరూ కలిసి ఉన్నప్పుడు యిద్దరూ రైతులే. వేరుపడిన తరువాత కూలీలుగా మారిపోయారు. అయినా ద్వేషపు చిచ్చు చెలరేగనీయకూడ దనుకున్నాడు శంకర్. కాని, పరిస్థితులు అతనికి మరో దారిలేకుండా చేశాయి. వేర్లుపడి వేరువేరు పొయ్యిలు పెట్టుకున్న రోజున వెక్కివెక్కి ఏడ్చాడు శంకర్. ఈ రోజు నుండి అన్నదమ్ములు శత్రువులైపోతారు. ఒకడు ఏడుస్తుంటే మరొకడు నవ్వుతాడు. ఒకడి ఇంట్లో శోకాలు పెడుతుంటే, మరొక డింట్లో పిండి వంటలు చేసుకుంటారు ప్రేమానుబంధాలూ, రక్తసంబంధాలూ, అన్నదమ్ముల బంధాలూ అన్నీ నేటితో అంతరించిపోతాయి. అతను భగీరథుడు పడ్డ బాధలన్నీపడి, వంశప్రతిష్ఠ అనే వృక్షాన్ని నాటాడు. తన రక్తంతో దాన్ని పోషించాడు. నే డా వృక్షం కూకటివ్రేళ్ళతో పెళ్ళగించబడుతుంటే అతని హృదయం తునాతునకలైపోతోంది. వారంరోజుల వరకూ శంకర్ అన్నం ఎలా ఉంటుందో కళ్ళచూడలేదు. రోజంతా జ్యేష్ఠ మాసపు ఎండలో పనిచేసేవాడు. రాత్రికి కడుపు మాడ్చుకుని పడుండేవాడు. ఈ భయంకరమైన దిగులూ, ఈ భరింపరాని శ్రమా రక్తాన్ని పీల్చేసింది మాంసాన్నీ, మూలుగులనూకూడా కరగదీసింది. జబ్బునపడటం జరిగితే నెలలతరబడి మంచంలోనే పడుండేవాడు. ఇక జీవనం గడిచే దెలా ? అయిదు బీఘాల పొలమల్లా సగానికి వచ్చింది.

ఒక్క ఎద్దు మిగిలింది. ఇక ఈ పరిస్థితుల్లో వ్యవసాయ మేం జరుగు తుంది బూడిద? రానురాను చివరకు వ్యవసాయం కులమర్యాద కాపాడుకోటానికి ఒక ఉపాయం మాత్రంగా పరిణమించింది. బ్రతుకు భారం కూలిద్వారానే మోయవలసి వచ్చేది.

ఏడు సంవత్సరాలు గడిచి పోయినాయి. ఒకరోజు శంకర్ కూలికివెళ్ళి తిరిగి వస్తున్నాడు. "ఏమోయ్ శంకర్! రేపువచ్చి నీ ధాన్యం బాకీ లెక్క చూసుకో. అయిదున్నరమణుగుల ధాన్యం యివ్వ వలసి ఎన్నాళ్ళయింది నువ్వూ? ఇద్దామని అనుకోనైనా అనుకోవేం? పంగనామాలు పెడదామనుకున్నావా ఏం?" దారిలో ఆపి అడిగాడు పురోహితుడు.

శంకర్ నివ్వెరపోయాడు — "అయిదున్నర మణుగులు కావ టానికి అసలు నేను మీ దగ్గర తీసుకున్నదెప్పుడూ? మీరు పొర పాటుపడ్డట్టున్నారు. నేనెవరికీ గిద్దెడు గింజలుగానీ, కాని రొఖ్ఖంగాని బాకీ అన్నమాటే ఎరుగను."

"ఇలా తయారుకాబట్టే తిండికికూడా వాచిపోయేగతి పట్టింది."

ఈ మాట అని, అప్పటికి ఏడు సంవత్సరాల్కితం తాను శంక ర్‌కు యిచ్చిన శేరుంబావు గోధుమల విషయం వివరించాడు అది విని శంకర్ నిశ్చేష్టుడైనాడు. అయ్యో! భగవంతుడా! నేను ఈయనకు మామూళ్లు ఎన్నిసార్లిచ్చానూ? నాకీయన కించిత్తు పనైనా చేయ లేదే. పంచాంగం చూపించుకోవాలన్నా, ముహూర్తం, శకునం వగైరాలు తెలుసుకోవాలన్నా ఎన్నడైనా వెళ్తే కొద్దో, గొప్పో దక్షిణ సమర్పించుకుంటూనే ఉండేవాణ్ణి. ఇంత స్వార్థమా! శేరుంబావు గోధు మలను, గ్రుడ్డును పొదిగినట్లు పొదిగి నన్ను మ్రింగటానికి ఒక భూతాన్ని తయారుచేసి కూర్చున్నాడు. ఈ మధ్య కాలంలో ఒక్కసారి మాటమాత్రం అని వుంటే నేను గోధుమలు తూచి మరీ ఇచ్చేసేవాణ్ణే. ఇలా తయారౌదామనేనా యిన్నాళ్లూ గుట్టుగా ఊరుకుంది? — స్వామీ! పేరుజెప్పి నేనెన్నడూ శేరుంబావు గోధుమలు యివ్వని మాట నిజమే. కాని, అనేకసార్లు మామూళ్ళ సందర్భాల్లో శేరూ, రెండు శేర్లూగూడా అదనంగా యిచ్చానే! ఇవ్వాళవచ్చి మీరు నన్ను

అయిదున్నర మణుగుల గోధుమ లివ్వాలంటే ఎక్కడనుండి తెచ్చేది చెప్పండి!" అన్నాడు శంకర్.

"అప్పు అప్పే; దానం దానమే. ఒక్క శేరు కాదు; ఐదు శేర్లు యిస్తే మటుకేం? నీ విచ్చిందేమీ లెక్కలోకి రాదు. ఖాతా పుస్తకంలో నీ పేరిట అయిదున్నర మణుగుల గోధుమలు బాకీవుంది. కావాలంటే నీ యిష్టం వచ్చిన వాళ్ళచేత లెక్క చూపించుకో. ఇచ్చావా ఖాతాలో నీ పేరు కొట్టేస్తాను. లేదా బాకీ యింకా పెరుగుతూనే వుంటుంది" అన్నాడు పురోహితుడు.

"స్వామీ! ఒక పేదముండా కొడుకును పీడించట మెందుకు చెప్పండి. పూట తిండికి గతిలేనివాణ్ణి. ఇన్ని గోధుమలు ఎవరింట్లో కొల్లగొట్టుకు రానూ?

"ఎవరింట్లో కొల్లగొట్టు కొస్తావో నాకు తెలియదు. నేను మాత్రం ఒక్క చటాకు గింజలుగూడా తీసివెయ్యను. ఇక్కడ తప్పించుకుంటే దేవుడిదగ్గర తప్పించుకుంటావా?"

శంకర్ వణకి పోయినాడు. చదువుకున్న మనంటివాళ్ళమైతే "సరే దేవుడుదగ్గర యిస్తాంలెండి. ఇక్కడకంటె అక్కడ ఎక్కువ యివ్వవలసి ఉండదులెండి!" అనే వాళ్ళమే. కనీసం అలా యివ్వవలసి వస్తుందనటానికి మన కాధారమేమీ లేదు. ఇక మనకు దాన్నిగురించి దిగులెందుకూ? కాని శంకర్ అంత తర్క శాస్త్రజ్ఞుడూ, లౌకికుడూ కాదు. ఒకటి రుణ బాధ—అదీ బ్రాహ్మణరుణం—అమ్మయ్యో! ఖాతాలో పేరుండిపోయిందంటే తిన్నగా నరకానికి వెళ్ళకతప్పదు. ఈ భావం కలగగానే అతని రోమాలన్నీ నిక్కబొడుచుకున్నాయి. "స్వామీ మీ కివ్వవలసిన బాకీ భగవంతుడి దాకా ఎందుకు? ఇక్కడే ఇచ్చేస్తాను. జన్మలో కష్టాలు అనుభవిస్తూనే వున్నాను. వచ్చే జన్మకుకూడా నిప్పులు జల్లుకోట మెందుకూ? అయినా యిదిమాత్రం న్యాయం కాదు. "స్వామీ! మీరు గోరంతలు కొండంతలు చేశారు. బ్రాహ్మణులై పుట్టి యిలా చెయ్యవలసింది కాదు. అప్పుడే పేచీపెట్టి మీ బాకీ మీరు వసూలు చేసుకొని ఉంటే యివ్వాళ నా నెత్తిన యింత బరువు

పడేదా చెప్పండి! నే నిచ్చేస్తా ననుకోండి. కాని మీరు మాత్రం భగవంతుడిముందు సంజాయిషీ చెప్పుకోక తప్పదు."

"అక్కడి భయాలు మీకుంటాయి. మాకెందుకుంటాయ్! అక్కడంతా మా సోదరులూ, బంధువులే. మహర్షులంతా మా బ్రాహ్మణులేగా. దేవతలుకూడా బ్రాహ్మణులే. ఏమైనా లోటుపాట్లుంటే వాళ్ళే సర్దుబాటు చేసుకుంటారు. అయితే మరి ఎప్పుడిస్తానంటావ్?"

"నా దగ్గరిప్పుడు హాజరుగా ఎక్కడున్నాయి స్వామీ! ఎవరినైనా అప్పో సప్పో అడిగితెస్తేగదా యివ్వగలిగేది." అన్నాడు శంకర్.

"అవ్వన్నీ నే నొప్పుకోను. ఏడు సంవత్సరాలైంది. ఇక ఒక్క రోజుకూడా ఆగను. దస్తావేజు వ్రాసివ్వు."

"నే నెటూ యివ్వవలసిందేగా! గోధుమలు తీసుకున్నా సరే; దస్తావేజు వ్రాయించుకున్నా సరే. మీ యిష్టం. ఏ లెక్కన కట్టుకుంటారు ధర?"

"బజారుధర అయిదుశేర్లుంది. అయిదుంబావు శేర్లచొప్పున సరి చేసుకుందాంలే."

"ఇచ్చినవాణ్ణి ఇవ్వనే ఇస్తున్నాను. బజారుధరే కట్టుకోండి. పావుశేరుకోసం అపరాధి నెందుకు కావాలి?"

లెక్కచూస్తే గోధుమలధర అరవై రూపాయలైంది. అరవై రూపాయలకు దస్తావేజు వ్రాశాడు, వడ్డీ నూటికి మూడు రూపాయలు. సంవత్సరం లోపల యివ్వకపోతే ఆ తరువాత వడ్డీరేటు నూటికి మూడున్నర రూపాయలు. స్టాంపుకు ముప్పావలా, దస్తావేజు మామూలు రూపాయి శంకర్ అదనంగా యిచ్చుకోవలసి వచ్చింది.

ఆ పురోహితుణ్ణి గ్రామమంతా నిందించింది. కాని ముఖం చాటున మాత్రమే. వడ్డీ వ్యాపారస్థుడితో అందరికీ పనుంటుందాయె.

అలాంటప్పుడు ఆయన ఎదుటపడే వాళ్ళెవరుంటారు?

# 3

శంకర్ సంవత్సరం పొడుగునా ఘోరంగా శ్రమపడ్డాడు. గడువు దాటకముందే డబ్బు కట్టేద్దామని దీక్ష పట్టాడతను. రెండు ఝాములైనా పొయ్యిరాజేదికాదు. ఏ సెనగలో తిని పూటుగడిపేవాడు. ఇప్పుడదీ మానేశాడు. పిల్లవాడికి మాత్రం రాత్రికి రొట్టెలు అట్టిపెట్టేవాడు. రోజు కొక కానీ చుట్టపొగాకు త్రాగేవాడు. అతను ఏ పరిస్థితుల్లోనూ వదిలిపెట్టలేని వ్యసనమల్లా అదొక్కటే. ఇప్పుడదికూడా ఈ కఠోరదీక్షకు అహుతైపోయింది. అతను తన భంగుపాత్రను బద్దలు కొట్టేశాడు. హుక్కాగొట్టం విరగగొట్టేశాడు. పొగాకుపాత్ర ముక్కలు ముక్కలు చేశాడు. దుస్తుల విషయంలో త్యాగపు అఖరు హద్దులను అతనెప్పుడో చేరుకున్నాడు ఇప్పుడతను ప్రకృతి దయాదాక్షిణ్యాలకు బద్ధుడైపోయాడు. శిశిరంలోని ఎముకలు కొరికే చలిలో చలిమంటలతో గడిపాడు. ఈ దృఢ సంకల్పానికి ఫలితం, ఆశించిన దానికి అధికంగానే లభించింది. సంవత్సరం ఆఖరుకు అతనివద్ద అరవై రూపాయలు పోగైనాయి. పంతులుగారికి ఆ అరవైరూపాయలూ యిచ్చి "స్వామీ! మిగతా పైకంకూడా త్వరగానే యిచ్చుకుంటాలెండి" అని చెప్పుకుందామనుకున్నాడు. ఇక పదిహేను రూపాయల భాగ్యం. పంతులుగారు ఆ మాత్రం ఒప్పుకోకపోతారా? శంకర్ ఆ రూపాయలు తీసుకుని వెళ్ళి పంతులుగారి పాదాలముందు సమర్పించుకున్నాడు. "ఎక్కడైనా అప్పు తెచ్చావా ఏం?" ఆశ్చర్యంగా అడిగాడు పంతులుగారు.

"లేదు పంతులుగారూ! మీ ఆశీర్వాదంవల్ల ఈ ఏడేదో విధంగా కూలి బాగా గిట్టిందిలెండి."

"కాని యిది అరవై రూపాయ లేనే?"

"ఔను స్వామీ! ఇది యిప్పుడు తీసుకోండి. మిగతాది రెండు మూడు నెలల్లో యిచ్చివేస్తాను. నా బాకీ రద్దుచేసెయ్యండి స్వామీ!"

"నా కివ్వవలసింది చిల్లిగవ్వతోసహా యిచ్చివేసిననాడే నీ బాకీ రద్దవుతుంది; వెళ్ళి మిగతా పదిహేనూ తీసుకురా."

"పంతులుగారూ! ఈమాత్రం కనికరించండి. రాత్రిపూట రొట్టెలకుకూడా గతిలేక అవస్థపడుతున్నాను. ఊళ్ళోవుంటే ఎప్పుడో ఒకప్పుడు తీర్చకపోను."

"నే నిటువంటి వ్యాధులను ఎంతమాత్రం ప్రోత్సహించను. నా కిన్నిమాటలు చేతగావుకూడా. నా పైకం యిప్పుడే పూర్తిగా ఇచ్చివేయకపోతే ఈ రోజునుండీ నూటికి మూడురూపాయలన్నర వడ్డీ యివ్వాలి తెలుసా? ఇదిగో నీ రూపాయలు. నీ యింట్లో ఉంచుకున్నా సరే; నా దగ్గర ఉంచినా సరే అదంతా నీ యిష్టం."

"సరేలెండి తెచ్చినంతవరకు మీ దగ్గరే ఉంచండి. నేను వెళ్ళి ఎక్కడైనా మిగతా పదిహేనుకుగూడా తిప్పలు బడతాను."

శంకర్ ఊరంతా గాలించాడు. కాని పైకం ఎవ్వరూ యివ్వలేదు శంకరంటే నమ్మకం లేకా కాదు; ఎవడి దగ్గరా పైకం లేకా కాదు; పంతులుగారి వేట పాడుచేయగల సాహసం ఒక్కడికీ లేదు మరి!

# 4

క్రియకు ప్రతి క్రియ సహజధర్మం. సంవత్సరమంతా పేగులు తెంచుకున్నా ఋణ బాధనుండి విముక్తుడు కాలేకపోయిన ఫలితంగా శంకర్ సంయమం నిరాశగా పరిణామంచెందింది "ఇన్ని బాధలు పడ్డా సంవత్సరం మొత్తంమీద అరవైరూపాయలకు మించి కూడబెట్ట లేకపోతినే! ఇక యింతకు రెండు రెట్లు రూపాయలు ఏ ఉపాయంతో కూడబెట్టనూ? ఋణభారం మోయటం ఎటుదిరిగీ తప్పనప్పుడు మణుగైతేనేం; రెండు మణుగులైతేనేం!" అనుకున్నాడు శంకర్. అతని ఉత్సాహం మందగించింది. శ్రమ చెయ్యటం అంటేనే అసహ్యం

ఏర్పడింది. ఆశఉత్సాహానికి తల్లివంటిది. తేజస్సూ, సామర్థ్యమూ అన్నీ ఆశలోనే ఉన్నాయి. అసలు జీవితాని కాధారమే ఆశ. ప్రపంచాన్ని నడిపిస్తున్న మహాశక్తి ఈ ఆశే. శంకర్ ఆశను కోల్పోయి విరక్తుడైపోయాడు. అతను ఈ సంవత్సరకాలం నుండీ త్రొక్కిపట్టి ఉంచిన అవసరాలు యిప్పుడిక బిచ్చగాళ్ళ లాగా గడపదగ్గర దేబిరించే స్థితిలో లేవు. ఇప్పుడవి గుండెల మీదెక్కి స్వారీచేసే భూతాల్లాగా తయారైనాయి. ఆభూతాలిక తమ పట్టు సెగ్గించుకోందే ప్రాణాలతో వదిలిపెట్టవు. గుడ్డలకు మాసికలు వేస్తూ గడపటానికి కూడా ఒక హద్దంటూ ఉంటుంది. ఇక యిప్పుడు శంకర్‌కు కూలి చేసిన డబ్బులొస్తే కూడబెట్టటం మానేశాడు. ఒకసారి గుడ్డలు తెచ్చేవాడు. మరొ కప్పుడు ఏ తినుబండారాలో తెచ్చేవాడు. పూర్వం రోజుల్లో చుట్ట మాత్రమే త్రాగేవాడల్లా యిప్పుడు గంజాయి లాంటి వ్యసనాల్లో కూడా పడ్డాడు. ఇప్పు డతనికి బాకీ చెల్లించాలనే ఆలోచనేలేదు. తాను ఎవరికీ ఒక్క చిల్లికానీ కూడా బాకీ లేనట్లుగానే ఉందతనికి. ఇదివరకు చలిజ్వరంతో బాధపడుతుండెడివాడు, అయినా తప్పకుండా పనికి వెళ్ళేవాడు. ఇప్పుడు పనికి వెళ్ళకుండా తప్పి చుకోటానికి సాకులు వెదకుతున్నాడు.

ఈ విధంగా మూడేండ్లు గడిచినాయి. పంతులుగారు ఈమధ్య కాలంలో ఎప్పుడూ బాకీ విషయం ప్రస్తావించనే లేదు. నేర్పరియైన వేటకాడిలాగా గురిగా దెబ్బతీద్దామనుకున్నాడు. వేట జంతువును ముందుగానే మేలు కొలపడం ఆయన నీతికి విరుద్ధం.

ఒకరోజు పంతులుగారు శంకర్‌ను పిలిచి లెక్కచూపించాడు. జమకట్టిన అరవై రూపాయలు పోను ఇంకా యిప్పటికీ నూట యిరవై రూపాయలు యివ్వ దేల్చాడు.

"ఇంత పైకం యింకో జన్మయెత్తి తీర్చవలసిందే. ఈ జన్మలో మాత్రం అయ్యేపని కాదు" అన్నాడు శంకర్.

"నేను ఈ జన్మలోనే వసూలు చేస్తాను. అసలు యివ్వక పోయినా వడ్డీ మాత్రం యిచ్చి తీరవలసిందే."

"ఒక్క ఎద్దు ఉన్నది. తోలుకోండి. ఒక్క గుడిసె మాత్రం ఉంది. తీసుకోండి. అంతకంటే నా దగ్గరేముంది. చెప్పండి."

"ఎద్దులూ, దూడలూ తీసుకుని నేనేం చేసుకుంటానూ. నా కివ్వాలనుకుంటే నీ దగ్గర చాలా పైకం ఉంటుంది"

"ఇంకా ఏముంది పంతులుగారూ !"

ఏమీ లేకపోతే నువ్వులేవు ? నువ్వూ ఎటూ ఎక్కడో ఒక చోట కూలికి వెళ్తున్నావుగదా! నాకూ వ్యవసాయానికి ఎటూ కూలీలను పెట్టుకోక తప్పదు. వడ్డీక్రింద నువ్వు మాదగ్గరే పని చేస్తుండు. వీలు చిక్కి నప్పుడు అసలు కూడా యిద్దువుగాని. ఇంతకూ ఉన్న విషయం చెబుతున్నా. నా బాకీ తీరిందాకా నువ్వు మరో చోటు పని చెయ్యటానికి వీల్లేదు. నీ దగ్గర ఆస్తిపాస్తు లేమీ లేవు. ఇంత పెద్ద బాకీ ఏ నమ్మకంతో వదిలి పెట్టనూ ? ప్రతి నెలా నువ్వు నా వడ్డీ చెల్లిస్తావని హామీ యిచ్చే దెవరు ? ఎక్కడో సంపాదించినా వడ్డీయే యివ్వలేక పోతే అసలు సంగతి ఆశ ఏమిటి ?"

"వడ్డీ క్రింద సరే పని చేస్తాను. మరి నా తిండి సంగ తెలా స్వామీ?"

నీ భార్య ఉండె; కొడుకూ ఉన్నాడాయె. వాళ్ళంతా కాళ్ళు చేతులు విరగగొట్టుకు కూర్చుంటారా ఏం ? మరి నీ సంగ తంటావా ? రోజూ ఒక అర్ధశేరు జొన్నలు అంబలి కాచుకోటానికి యిస్తుంటాలే. కప్పుకోటానిక సంవత్సరాని కొక కంబళి యిప్పిస్తాను. ఒక చొక్కాగూడా కుట్టిస్తాను. ఇంక నీకు కావలసిందేముందీ ? ఇతరులైతే నీకు రోజుకు పావలార్ధణా కూలి యిస్తారన్నది నిజమే ననుకో ! కాని నిన్ను నేను పనిలో ఉంచుకుంటున్నది నా బాకీ తీర్చుకోటంకోసంగాని నా అవసరంకోసం కాదుగా ?"

కొంచెం సేపటివరకూ దీర్ఘమైన ఆలోచనలో మునిగిపోయి "యిది చివరకు జన్మదాస్యమేగద స్వామీ!" అన్నాడు శంకర్.

"దాస్యం అనుకో; కూలీ అనుకో. ఎలా అనుకున్నాసరే. నేను నా బాకీ రాబట్టుకోకుండా మాత్రం నిన్ను వదలిపెట్టను. నీవు పాc

పోతే నీ కొడుకు తీరుస్తాడు. ఇక ఎవరూ లేకపోతే అప్పటి సంగతి వేరు."

ఈ తీర్పు కిక తిరుగులేదు. కూలివాడికి హామీ ఉండే దెవరు? మరో దిక్కు ఎక్కడుంది? పారిపోతే మాత్రం ఎక్కడికి వెళతాడు? మరుసటిరోజునుంచీ శంకర్ పంతులుగారివద్ద పనిచెయ్యటం ప్రారంభించాడు. శేరుంబావు గోధుమల కారణంగా జీవితమంతా బానిసగా బ్రతకవలసి వచ్చింది. 'ఇదంతా నా పూర్వజన్మ సంస్కార' మనే భావమొక్కటే యిప్పుడా నిర్భాగ్యుడికి తృప్తి కలిగిస్తోంది. భార్య తాను ఎన్నడూ చేయనిపనులన్నీ చేయవలసి వచ్చింది. పిల్లలు అన్నానికి గిలగిలలాడి పొయ్యేవాళ్ళు. కాని కళ్ళప్పగించి చూడటం మినహా యింకేమీ చేయలేక పోయేవాడు. ఆ గోధుమల బాకీ ఏదో దేవత శాపంగా జీవితపర్యంతం అతని శిరస్సునుండి వైదొలగలేదు.

## 5

శంకర్ ఆ బ్రహ్మణునివద్ద యిరవై సంవత్సరాలు దాస్యం చేసి చేసి ఈ సారహీనమైన ప్రపంచంనుండి ప్రయాణం గట్టాడు నూట యిరవై రూపాయలరుణం యింకా అతనినెత్తిమీదెక్కి స్వారీ చేస్తూనే ఉంది. ఆ బ్రాహ్మణుడు పాపమా నిర్భాగ్యుణ్ణి భగవంతుడి దర్బారులో ఇంకా హింసపెట్టడం భావ్యంకాదనుకున్నాడు. అతనంత అన్యాయస్థుడు గానీ, కటికవాడుగానీ కాదు. వయసులో ఉన్న శంకర్ కొడుకు గొంతు మీద కూర్చున్నాడా విప్రుడు. ఈ రోజువరకూ యింకా అతను ఆ బ్రాహ్మణునివద్ద చాకిరీ చేస్తూనే ఉన్నాడు అతనికి విముక్తి ఎప్పుడో? అసలు విముక్తంటూ ఉంటుందా? ఏమో ఆ భగవంతుడికే తెలియాలి!

పాఠకు లీ కథంతా వట్టి కల్పితమనుకుంటున్నారు కదూ? కాదు కాదు. ఇదొక వాస్తవిక ఘటన. ఇటువంటి శంకర్‌లూ, ఇటువంటి విప్రులూ యింకా ఈ ప్రపంచంలో ఉండనే ఉన్నారు.

# బిళ్ళంగోడు

**మా** ఆంగ్లపండిత మిత్రుడు ఔననీండి; కాదనీండి. బిళ్ళంగోడుమాత్రం ఆటలన్నిటికీ రాజంటాను నేను. ఇప్పటికీ పిల్లలెక్కడైనా బిళ్ళంగోడు ఆడటం కంటబడితే ముగ్ధుణ్ణయిపోతాను. వాళ్ళతో కలసి ఆడుదామా అని తహతహ లాడిపోతాను.

కోర్టు, నెట్టూ, బేటూ—ఇవ్వేమీ అక్కరలే దీ యాటకు. హుషారుగా ఏ చెట్టున్నా ఎక్కి ఒక కొమ్మ విరగదీయటం. బిళ్ళంగోడు తయారుచెయ్యటం, అంతే! ఇద్దరు చేరినా ఆట సాగిందన్నమాటే. విదేశీ ఆటల్లో ఒక లోటుంది. వాటికి కావలసిన పరికరాలు బోలెడు ధరపెడితే గాని రావు. కనీసం వందరూపాయలైనా ఖర్చు పెడితేగాని ఆటగాళ్ళ లెక్కలోకి రారు. బిళ్ళంగో డున్నదంటే ఆడంబర మేమీ లేకుండానే మాంచి రక్తికడుతుంది ఆట. మనం మన వస్తువులంటేనే ఏవగించునేటంతగా విదేశవస్తువ్యామోహంలో పడి ఉన్మాదులమైపోతున్నాం. మన స్కూళ్ళలో ప్రతిపిల్లవాడినుంచీ ప్రతి సంవత్సరం కేవలం ఆటలకోసమే మూడు నాలుగురూపాయల ఫీజు వసూలుచేస్తున్నారు. చిల్లిగవ్వ ఖర్చు

కాకుండా ఆడటానికి వీలయ్యేవి మన భారతీయ ఆటలు. మన దేశీయ ఆటలు ఆడించుదామన్న ఆలోచన ఒక్కడికీ తోచదేం? ఇంగ్లీషు ఆటలు ధనవంతులకైతే అనుకూలం. ఈ వ్యసనం తీసుకొచ్చి పేదపిల్లల నెత్తిన రుద్దుతారేం? బిళ్ళంగోడు వల్ల కళ్లు బొత్తలు పడతాయేమో ననే భయం ఉండేమాట నిజమే. అయితే, క్రికెట్‌వల్ల కూడా తలలు బద్దలు కావటానికీ, డొక్కలు పగలటానికీ, కాళ్ళు విరగ టానికీ అవకాశముంది. నా నొసటు ఈనాటికీ బిళ్ళంగోడు దెబ్బ గుర్తు న్నదంటారా? అయితే క్రికెట్ మూలంగా కొయ్యకాళ్ళు తగిలించు కున్న మిత్రులుగూడా బోలెడుమంది ఉన్నారు. సరే! అదంతా వాళ్ళ వాళ్ళ యిష్టం. నాకుమాత్రం ఆట లన్నిటిలోకీ బిళ్ళంగోడే బాగుం టుంది. నా బాల్య స్మృతుల్లోగూడా బిళ్ళంగోడుకు సంబంధించిన ఘటనలే మధురంగా ఉంటాయి. ప్రొద్దున్నే బయలుదేరటం, చెట్లెక్కి ఆ కొమ్మలు విరవటం, బిళ్ళంగోళ్ళు తయారు చెయ్యటం, ఆ హుషారూ, అ పట్టుదల, ఆ ఆటగాళ్ళ జట్లూ, ఆట పెట్టటాలూ, పెట్టించటాలూ, ఆ పోట్లాటలూ, పేచీలు – అంతరానితనాలూ, కలిమి లేముల భేదాలు కలికానికైనా కానరాని ఆ నిష్కపట స్వభాలూ ఎంత చిత్రంగా ఉండేవి. ధనవంతుల నిక్కులకూ, ఆడంబరాలకూ, దర్పా లకూ, దురభిమానాలకూ వీసమంతైనా ఆస్కారముండేదా! ఆ మధుర దినాలను మరచిపోవటం ఎప్పటికైనా ... ...ఏనాటికైనా సాధ్య మౌతుందా! అబ్బ... అసంభవం, ఇంట్లోవాళ్ళు మండిపడుతుంటారు. నాన్నగారు భోజనంముందు కూర్చుని కోపమంతా రొట్టెలమీద చూపిస్తూ ఉంటారు. అమ్మ నాకోసం మాటిమాటికీ వాకిలివైపుచూస్తూ ఉంటుంది. అంతకంటె ఆమె ఏం చెయ్యగల్గుతుంది? వారి దృష్టిలో నా అంధకారమయ భవిష్యత్తు బ్రద్దలైన ఓడలాగా తబ్బిబ్బవుతోంది. కాని నాకో! స్నానం, భోజనం వీటి ధ్యాసే పట్టలేదు. ఆట పెట్టించు కునే నిషాలో ఉన్నాను నేను. బిళ్ళంగోడు చూస్తే జానెడుకూడా లేదు. కాని ప్రపంచంలోని మిఠాయి లన్నింటిలోనూ ఉండే తీపి, వినోదాల్లో ఉండే ఆనందమూ ఈ బిళ్ళంగోడులోనే ఉన్నాయి.

నా మిత్రుల్లో గయా అనే కుర్రాడొకడున్నాడు. నాకంటె

రెండుమూడేళ్ళు పెద్ద. సన్నగా, పొడుగ్గా ఉంటాడు. కోతుల వ్రేళ్ళ మాదిరిగా సన్నని, పొడుగాటి వ్రేళ్ళు వాడివి. దుందుడుకుతనం చూచినా, పోకిరీతనం చూచినా వాడి వాలకమంతా అచ్చగా కోతే. ఎలాంటి బిళ్ళంగోడయినాసరే పురుగులమీదకి బల్లి ఉరికినట్లుగా ఉరికేవాడు. అతనికి అమ్మా, నాన్నా ఉన్నారో లేదో, ఎక్కడుంటు న్నాడో ఏమిటో, తిండితింటున్నాడో లేదో ఈ విషయాలేమీ నాకు తెలియవు. కాని మా బిళ్ళంగోడు క్లబ్బులో అతనే ఛాంపియన్. అతను చేరినపక్షం జయించితీరిందన్నమాటే. మేమంతా వాడు రావటం దూరాన్నుంచేచూచి పరుగెత్తి ఆహ్వానించి మా తరఫున చేర్చు కునేవాళ్ళం.

ఒకరోజు నేనూ, గయా మే మిద్దరమే ఆడుకుంటున్నాం. వాడు ఆట పెట్టించుకున్నాడు. నేను పెడుతున్నాను. కాని తమాషా ఏమిటో! ఆట పెట్టించుకుంటుంటేమాత్రం రోజంతా ఐనా హుషారుగా ఉంటాం. కాని ఆట పెట్టేటప్పుడుమాత్రం నిమిషంసేపయినా దుర్భరమనిపిస్తుంది. తప్పించుకోటానికి ఎన్ని ఎత్తులో ప్రయోగించాను. రూల్సుకు వ్యతిరేక మైనా అటువంటి సందర్భాల్లో అవన్నీ మామూలే. అయినా గయా తన ఆట పెట్టించుకోందే వదిలిత్తేగా!

నేను యింటివైపుకు పరుగెత్తాను. బ్రతిమాలినందువల్ల ఏమీ లాభంలేకపోయింది. మరేం చెయ్యనూ!

గయా పరుగెత్తి పట్టుకున్నాడు నన్ను. లాఠీకర్ర పైకెత్తి "నా ఆటపెట్టి మరీ కదులు. నా చేత పెద్ద మొనగాడిమాదిరి పెట్టించు కుంటివే ఆటా? నువ్వు పెట్టొచ్చేప్పటికి పారిపోతావేం" అన్నాడు.

"రోజంతా పెట్టమంటె పెడతానేం!"

"ఆ! రోజల్లా పెట్టాల్సిందే నువ్వు."

"తిండీ తినక్కరలేదు. నీళ్లూ త్రాగనక్కరలేదన్నమాట."

"ఔను! అంతే! నా ఆట పెట్టందే ఎక్కడికీ వెళ్లటానికి వీల్లేదు"

"నేనేం నీ బానిసనా?"

"ఆ! నా బానిసవే."

'అయితే నే నింటికి వెళ్ళిపోతున్నా. చూస్తా నేంచేస్తావో.'

'ఇంటి కెళతా ? ఏం ? తమాషా అనుకున్నావా ? ఆట గెలిచాను గనుక ఆటపెట్టి మరీ కదులు.'

'అయితే నిన్న నే నిచ్చిన జామకాయ నా కిచ్చేసెయ్.'

'అది పొట్టలో కెళ్ళిపోయింది.'

'అయితే బయటికి తియ్యి. ఎందుకు తిన్నావేం నా జామ కాయా ?

'నువ్విస్తే తిన్నాను. నేను ని న్నేమీ దేబిరించలా.'

'నా జామకాయ యిచ్చిందాకా నేను ఆటపెట్టను.'

నా అభిప్రాయం నాదే న్యాయమని, ఇంతకూ ఏదో స్వార్థం తోనే ఆ జామకాయ యిచ్చానన్నమాట. ఎవడితోనైనా నిస్వార్థంగా ప్రవర్తించేవాళ్ళెవ్వరూ ? బిచ్చం పెట్టటంకూడా స్వార్థానికే. నా జామ కాయ తిన్న గయాకు నాచేత ఆట పెట్టించుకునే అధికార మెక్క డుందీ? లంచమిచ్చి మనుషులు రక్తాన్నిగూడా జీర్ణించుకుంటారు. నా జామకాయ ఉత్తినే జీర్ణమౌతుంది ? కానీకి అయిదు యిస్తున్నారు జామకాయలు. గయా తండ్రికూడా అవి తింటానికి నోచుకోడు. అటువంటప్పుడు గయాది కేవలం అన్యాయంకదూ ?

గయా నన్ను తనవైపుకు లాగుతూ 'జామకాయలూ, గీను కాయలూ నా కేం తెలియవు. నా ఆట చెల్లించి మరీ కదులు' అన్నాడు.

న్యాయబలం నావైపుంది. అతను అన్యాయానికి పాలుపడ్డాడు. నాకు చెయ్యి విదిలించుకు పారిపోదామనుంది. కాని అతను నన్ను పోనీటం లేదు. బూతులు తిట్టాను నేను. వా డంతకంటే ఎక్కువగా బూతులు తిట్టాడు. తిట్టటమే కాదు, లాగి రెండు దెబ్బలు కూడా వేశాడు. అతన్ని పట్టుకు కొరికాను నేను. దాంతో వాడు చేతిలో కర్రపెట్టి లాగి వీపుమీద ఒక్కటి వేశాడు. నేను ఏడవటం మొదలెట్టాను. గయా ఈ నా అస్త్రాన్ని- ఎదుర్కోలేక పోయినాడు. అక్కడనుండి పారిపోయినాడు. వెంటనే నేను కళ్ళనీళ్ళు తుడుచుకున్నాను. కర్రదెబ్బ మరచిపోయి నవ్వుకుంటూ యిల్లు చేరాను. నేను సబ్ యిన్స్పెక్టరు

కొడుకునైయుండి ఒక నీచజాతి వెధవచేతుల్లో తన్నులు తినటం. అప్పుడుగూడా నాకు అవమానకరంగానే ఉంది. కాని ఆ విషయం యింట్లో ఎవరితోనూ రిపోర్టు చెయ్యలేదు.

# 2

అప్పుడే మా నాన్నగారక్కడనుండి బదిలీ అయినారు. క్రొత్త ప్రపంచం చూడబోతున్నానన్న సంతోషంతో ఎంతగా మురిసి పోయానంటే స్నేహితులకు దూరమై పోతున్నానే అన్న విచారమే కలుగలేదు. మా నాన్నగారికి మాత్రం బాధగానే ఉంది. అది మంచి ఆదాయం వచ్చే ప్రాంతం. అమ్మకుకూడా కష్టంగానే ఉంది. ఇక్కడ అన్ని వస్తువులూ చౌక. అదీగాక పేటలోని ఆడవాళ్ళందరితో మంచి స్నేహం ఏర్పడింది. నేనుమాత్రం సంతోషంతో ఉప్పొంగి పోతు న్నాను. కుర్రాళ్ళతో కోతలు కోసేశాను. మేము వెళ్ళబోయే ఊళ్ళో యిలాంటి యిళ్లు ఉండనే ఉండవు. చుక్కలు తాకే పెద్ద పెద్ద ఎత్తయిన మేడలుంటాయి. అక్కడ యింగ్లీషు స్కూళ్ళల్లో పంతులు గనక పిల్లలమీద చెయి జేసుకుంటే జైలుకు పంపిస్తారు. నా మిత్రుల విప్పారిన నేత్రాలూ, ఆశ్చర్యం నిండిన నివ్వెరపాటూ చూస్తుంటే, వారి దృష్టిలో నేనెంత ఉచ్ఛస్థాయికి చేరుకున్నానో అర్థమౌతుంది. అబద్ధాన్ని నిజంగా చిత్రించటంలో పిల్లలకుండే ఆ ప్రతిభ, నిజాన్ని అబద్ధంగా చిత్రించే మనం ఏమర్థం చేసుకోగలం! పాపం వాళ్ళందరికీ నాతో పోటీపడాలని ఎంత యిదిగా ఉండనుకున్నారు! "నువ్వెక్క డోయ్ దేవుడనైనేనూ, సరే పో! మాకు చావూ, బ్రతుకూ అన్నీ ఈ దిక్కుమాలిన ఊళ్ళోనేగా!" అని వాళ్ళంతా అంటున్నా రని పించింది.

ఇరవై సంవత్సరాలు గడిచిపోయింది. నేను యింజనీరింగ్ ప్యాసయి, ఆ జిల్లాలోనే టూరు చేస్తూ చేస్తూ, ఆ గ్రామానికి చేరుకుని

బంగళాలో బసచేశాను. ఆ స్థలాన్ని చూడగానే మధురమైన నా బాల్యస్మృతులన్నీ ఒక్కసారిగా తలుపుకొచ్చాయి. వెంటనే చేతిబెత్తం తీసుకొని గ్రామంలో షికారుకు బయలుదేరాను. దప్పిక గొన్న బాటసారిలాగా చిన్ననాటి ఆటస్థలాలన్నిటినీ చూడాలని తహతహ లాడిపోయాను. ఇదివరకే పరిచితమైన ఊరుపేరు మినహా, మరో పరిచిత వస్తువేదీ కనిపించలేదక్కడ. పూర్వం శిథిల గృహా లున్న ప్రాంతంలో ఇప్పుడు భేషైన భవనాలు వెలిశాయి. ఇదివరకు మర్రిచెట్టున్నచోట మంచి అందమైన ఉద్యానవనముంది. ఊరు రూపంతా మారిపోయింది. ఊరు పేరూ, దాని పూర్వస్థితీ తెలిసి ఉండకపోతే అసలు గుర్తుపట్టగలిగి ఉండేవాణ్ణే కాదు. మరుపురాని చిన్ననాటి మధుర స్మృతులు చేతులుజాచి తమ పూర్వ స్నేహితులను ఆలింగనం చేసుకునేందుకు తహతహ లాడుతున్నాయి. కాని ఆ పరి స్థితులు మారిపోయినాయి. ఆ భూమాతను ఆలింగనం చేసుకుని "నన్ను మరచిపోయినావా? నిన్నిప్పుడు మళ్ళీ ఆ పూర్వ రూపంలోనే చూడ్డామనిపిస్తోంది తల్లీ!" అంటూ శోకించా లనిపించింది.

తటాలున ఒక బయలు ప్రదేశంలో యిద్దరు ముగ్గురు కుర్రాళ్లు బిళ్ళంగోడు ఆడటం చూచాను. ఒక్కక్షణం నన్ను నేను మరిచి పోయాను. వేషం, హెూదా, అధికారం, దేన్నిబట్టిచూచినా నే నొక పెద్ద ఆఫీసరునన్న విషయమే మరిచిపోయాను.

"అబ్బాయ్! యిక్కడ గయా అనే పేరుగలవాళ్ళెవరైనా వున్నారా?" దగ్గరకుపోయి అడిగా నా కుర్రాళ్ళను.

ఒక కుర్రాడు బిళ్ళంగోడును సవరిస్తూ, జంకుగొన్న స్వరంతో "గయా ఎవరూ? మాదిగతనుగదండీ" అన్నాడు.

"ఔనౌను. అతనే. గయా అనే పేరుగలవాడెవరైనా ఉంటే బహూశా అతనే అయిఉండాలి" అన్నాను.

"ఔను. ఆ పేరుగలవాడున్నాడులెండి."

"కాస్త అతన్ని పిలుచుకొస్తారూ?"

కుర్రాడు పరుగెత్తుకుంటూ వెళ్ళాడు. ఒక్కక్షణంలో అయిదు అడుగుల ఒక నల్లమూర్తిని వెంటబెట్టుకురావటం చూచాను.

దూరాన్నుండే గుర్తించాను నేను. అతనివైపుకు గంతువేసి అతన్ని ఆలింగనం చేసుకుందా మనుకున్నాను. కాని కొంచెం ఆలోచించి ఆగిపోయాను.

"ఏమోయ్ గయా! నన్ను గుర్తుపట్టావా?" అన్నాను.

గయా వంగి సలాంచేసి "చిత్తం అయ్యగారూ! గుర్తెందుకు పట్టలేనండీ! తమరు కులాసాగా ఉన్నారా?" అన్నాడు.

"హాయిగా ఉన్నానోయ్, మరి నీ సంగతి చెప్పు."

"డిప్టీకలెక్టరుగారి గుర్రం దగ్గర పనిచేస్తున్నానులెండి."

"మత్తయ్, మోహన్, దుర్గా వీళ్ళంతా ఏం చేస్తున్నారు? నీ కేమైనా తెలుసా?"

"మత్తయ్ చనిపోయాడు. దుర్గా, మోహనూ పోస్టుబంట్రోతులుగా ఉంటున్నారు. మరి అయ్యగారేంజేస్తున్నారో!"

"నేను ఈ జిల్లాకు యింజనీరునులే."

"అయ్యగారూ మొదటినుండీ తెలివిగలవారే."

"ఇప్పు డెప్పుడైనా బిళ్ళంగోడు ఆడుతున్నావా?"

నా వైపు ప్రశ్నార్థకంగా చూచి, "యిప్పు డింకా బిళ్ళంగోడు ఏ మాడతాను అయ్యగారూ. ఇప్పు డెంతసేపూ పొట్టతిప్పలే సరిపోతుండె" అన్నాడు గయా.

"అయితే రా! ఇవ్వాళ మనిద్దరం ఆడదాం. నీవు ఆట పెట్టించుకో; నేను ఆట పెడతా. నేను ఒక ఆట నీకు బాకీ ఉన్నాను ఇవ్వాళది తీర్చేసుకో."

ఎంతో కష్టంమీద అంగీకరించాడు గయా. అత నేమో మామూలు కూలివాడు; నేనా ఒక పెద్ద ఆఫీసరును. అతనికీ, నాకూ సంబంధ మేమిటి? పాప మతను సిగ్గుపడుతున్నాడు. నాకూ సిగ్గుగానే ఉంది. గయాతో కలిసి ఆడబోతున్నందుకుకాదు; జనం ఈ ఆటను విడ్డూరంగా భావించి వినోదించటం కోసం గుంపులు గుంపులుగా చేర తారని, ఆ జనంలో ఆనందం యెక్కడి నుంచొస్తుంది? కాని ఆడకుండా ఉండటానికి మన సొప్పటంలేదు, చివరకు యిద్దరం కలిసి ఊరునుండి చాలాదూరంగా వెళ్ళి, ఏకాంతంగా ఆడుకుందామని నిశ్చయించు

కున్నాం. అక్కడ ఎవరూ ఉండరుగా తీరికగా కూర్చుని చూడటానికి. హాయిగా ఆడుకోవచ్చు. చిన్ననాటి ఆనందాన్ని మళ్ళీ ఒక్కసారి అనుభవించవచ్చు. నేను గయాను వెంటబెట్టుకుని బంగాళాకు వచ్చాను. కారెక్కి యిద్దరం మైదానంవైపుకు వెళ్ళాం; కూడా ఒక గొడ్డలిగూడా తీసుకువెళ్ళాం. నేను చాలా గంభీరంగా ఉన్నాను. కాని గయా యిప్పటివరకుగూడా యిదంతా ఎగతాళనే అనుకుంటున్నాడు. అయినా అతని ముఖంలో ఉత్సాహంగానీ, ఆనందంగానీ అగుపించటం లేదు. బహుశా అతను మా యిద్దరి మధ్యా వచ్చిన అంతరాన్ని గురించిన ఆలోచనలోనే మునిగిఉన్నా డనుకుంటాను.

'నిజం చెప్పు! నే నెప్పుడైనా నీకు జ్ఞాపకం వచ్చేవాణ్ణినా?' ప్రశ్నించాను నేను.

'మిమ్మల్ని నేను జ్ఞాపక ముంచుకునేదేమిటి బాబుగారూ! బాబుగారూ! నా తాహతెంత నేనెంత! మీతో కొన్నాళ్ళు ఆడుకునే అదృష్టం కలిగింది. లేకుంటే నా దేముంది చెప్పండి' సంకోచ పడుతూ అన్నాడు గయా.

నేను కాస్త దీనంగా యిలా అన్నాను – 'నాకు మాత్రం నువ్వెప్పుడూ జ్ఞాపకం వచ్చేవాడివి. అప్పు డొకసారి కర్రతో లాగి యిచ్చుకుంటివే వీపుమీద – గుర్తుందికదూ!'

'అదంతా కుర్రతనంలేండి అయ్యగారూ! మళ్ళా అవ్వన్నీ గుర్తు చెయ్యకండి' పశ్చాత్తాపపడుతూ అన్నాడు గయా.

'బలేవాడివి! నా చిన్ననాటి సంగతుల్లో మధురాతి మధురమైన ఘటన అది. ఆ దెబ్బలో ఉన్న మాధుర్యం యిప్పటి నా గౌరవ సత్కారాల్లోగాని, ఐశ్వర్యంలోగాని లేదోయ్. దానిలో ఉండే విశేష మేమిటోగాని ఆ విషయం తలపుకొస్తే ఈ నాటికీ ముగ్ధుణ్ణయిపోతుంటాను.'

ఇంతలో మేము ఊరునుండి షుమారొక మూడుమైళ్ళ దూరం వచ్చేశాం. నలువైపులా ప్రశాంతంగా ఉంది. పడమటివైపున మైళ్ళ పొడుగున బ్రహ్మాండమైన చెరువొకటుంది. ఒకప్పుడు మేము అక్కడికి వచ్చి తామరపూలు కోసుకువెళ్ళేవాళ్ళం. వాటితో లోలకులు తయారు

చేసి చెవులకు తగిలించుకునేవాళ్ళం. కుంకుమ పువ్వు కాంతులీనే జ్యేష్ఠ మాసపు సాయంత్రమది. నేను ఎగిరి ఒక చెట్టుమీద ఎక్కాను. ఒక కొమ్మ నరికి గబగబా బిళ్ళంగోడు తయారుచేశాను.

ఆట ప్రారంభమైంది. నేను గుంటుమీద బిళ్ళంగోడు పెట్టి ఎగర గొట్టాను. బిళ్ళ గోడు గయా మీదుగానే ఎగిరిపోయింది. చేపలు పట్టేవాడిలాగా చెయ్యిజాచాడు గయా. కాని బిళ్ళంగోడు అతని వెనక్కుపోయి పడింది. ఒకప్పుడు దానంతటదే అతని చేతుల్లో పోయి వాలేది బిళ్ళంగోడు. అది కుడిప్రక్కగారానీ, ఎడం ప్రక్కగా రానీ అతని చేతుల్లో చిక్కి తీరవలసిందే. బిళ్ళంగోడుపై వశీకరణ మంత్రం ప్రయోగించాడా అనిపించేది. క్రొత్తది, పాతది, చిన్నది, పెద్దది, కోసుది, నున్నటిదీ – ఎలాంటి బిళ్ళంగోడయినాసరే అతనికి వశం కావలసిందే. అతని చేతుల్లో బిళ్ళగోళ్ళను ఆకర్షించే సూదంటురాయి ఉందేమోననిపించేది. ఆనాటి గయాయే యితను. కాని బిళ్ళంగోళ్ళకి యిప్పుడతనంటే ఆ పూర్వపు వ్యామోహం పోయింది. ఓడిపోయినా డతను. నేనూ ఆటపెట్టించుకోసాగాను. రకరకాల ఎత్తులు వేస్తున్నాను. నేను నైపుణ్యలోపాన్ని అన్యాయంతో పూర్తిచేస్తున్నాను బిళ్ళంగోడును ఎగురవేసి కొట్టటంలో గురి తప్పిపోతే ఆట ఛాన్సు మారుతుంది. అంటే రూల్స్ ప్రకారం గయావంతు రావాలన్నమాట. బిళ్ళంగోడుకు సరైన దెబ్బ తగులక, అది దగ్గరలోనే పడటం జరిగితే ఒక్కగంతులో నేనే వెళ్ళి బిళ్ళంగోడు చేతికి తీసుకుని రెండోసారి కొట్టేవాణ్ణి. గయా ఈ అక్రమాలన్నీ చూస్తూనే ఉన్నాడు. ఆట రూల్సన్నీ మరిచిపోయాడా అన్నట్లు ఏమీ మాట్లాడటంలేదు. అతని గురి ఎంతసూటిగా ఉండేది! బిళ్ళంగోడు అతని చేతిలోనుండి బయలుదేరి 'ఠంగ్' మని సూటిగా కర్రకు వచ్చి తగిలేది. అతని చేయి దాటిం తరువాత, బిళ్ళంగోడు పనల్లా కర్రకుఢీకొట్టటమే! కాని అదేమిటో ఈరోజు అతని బిళ్ళంగోడు కర్రకసలు తగలటమేలేదు. ఒకసారి కుడికీ, ఒకసారి ఎడమకూ, ఒకప్పు డవతలా, ఒకప్పు డివతలా – యిలా ప్రతిసారీ గురితప్పిపోతూనేఉంది.

ఇలా ఒక అరగంట ఆడిన తరువాత ఒకసారి బిళ్ళంగోడు వచ్చి కర్రకు తగిలింది. నేను గల్లంతు చేశాను. "బిళ్ళంగోడు కర్రకు తగల

లేదు. మరీదగ్గరగా పోయింది. అంతే! కర్రకు తగలనేలేదు" అన్నాను.

గయా ఏవిధమైన అసంతృప్తి ప్రకటించలేదు.

"తగల్లేదేమో లెండి!"

"కర్రకు తగిలితే నేను అబద్ధమాడతానా?"

"లేదులెండి బాబుగారూ! మీరలా అంటారా?"

చిన్నతనంలో అయితే ఇలా గడబిడచేసి ప్రాణాలతో బయటు పడేవాణ్ణేనా! ఇతనే నా గొంతుమీదెక్కి కూర్చునేవాడు. కాని యివ్వాళ్ళ నేను అతన్ని ఎంత తేలికగా టోకరా గొడుతున్నాను! వట్టి మొద్దుగాడు. ఆట రూల్సన్నీ మరిచిపోయినాడు.

అకస్మాత్తుగా బిళ్ళంగోడు తిరిగి కర్రకు తగిలింది. అదీ ఎలా తగిలిందనుకున్నారు! తుపాకి గుండులాగా తగిలింది. యిక నేను ఏ రకంగానూ మోసం చెయ్యటానికి మళ్ళీ సాహసించలేకపోయాను. అయినా మరోమారు సత్యాన్ని అసత్యమనిపించటానికి ప్రయత్నించి చూస్తే ఏం? నా దేంపోతుందీ? ఒప్పుకుంటే ఒప్పుకుంటాడు; లేదూ— నాలుగైదు అడుగులు దోకుళ్లు పెట్టవలసి వస్తుంది. అంతేగా! చీకటి పడిందని వంకపెట్టి నిమిషంలో తప్పించుకొంటాను. మళ్ళీ ఆట పెట్ట టానికి వచ్చేదెవరింకా!

"తగిలింది! తగిలింది! 'ఠంగ్'మని తగిలింది," విజయోత్సాహంతో అన్నాడు గయా.

"తగిలినప్పుడు చూశావా నువ్వా? నేనుమాత్రం చూడలేదు మరి!" ఏమీ ఎరగనట్లు నటిస్తూ అన్నాను నేను.

"ఠంగ్ మని తగిలింది బాబుగారూ!"

"ఏదైనా యిటుకరాయికి తగిలిందేమోలే."

అప్పుడు నా నోటివెంబడి ఈ మాట ఎలా వచ్చిందో నాకే ఆశ్చర్యంగా ఉంది. ఆ సత్యాన్ని తలక్రిందులు చేయటం అంటే పగ లును రాత్రనటమే. బిళ్ళంగోడు 'టయ్' మంటూ వచ్చి కర్రకు తగలటం యిద్దరమూ చూచాం, కాని గయా నా మాటకు ఒప్పు కున్నాడు.

"ఏ ఇటుకరాయికో తగిలి ఉంటుందిలెండి. కర్రకుతగిలితే అంత పెద్ద శబ్దమైయుండేదికాదు."

నేను మళ్ళీ ఆట పెట్టిస్తున్నాను. కాని యింత పచ్చిమోసం చేసిన మీదటకూడా గయా చూపిన ఉదారత్వానికి నాకు చాలా జాలివేసింది. అందువల్ల మూడవసారి బిళ్ళంగోడు కర్రకు తగలగానే నేను ఎంతో ఉదారంగా ఆట పెట్టటానికి సిద్ధమయ్యాను.

"ఇవ్వాళ ప్రొద్దుగూకి పోయింది. రేపు చెల్లించుదురుగాని లేండి మీ ఆట" అన్నాడు గయా.

ఆలోచించాను నేను బాబో! రేపు చాలాసేపు టైముంటుంది ఇతగా డెంతసేపు వేధిస్తాడో యేమో. ఈ గొడవ యిప్పుడే వదిలించు కుంటే మంచిది.

"అలాకాదు యింకా వెలుతురు బాగానే ఉందిలే నీ ఆట చెల్లిం చేసుకో."

"బిళ్ళంగోడు కనపడదు బాబుగారూ!"

"పరవాలేదులే కానీ!"

గయా ఆటపెట్టించుకోటం మొదలెట్టాడు. కాని అతని కిప్పుడు బొత్తిగా అలవాటే తప్పిపోయింది. బిళ్ళంగోడును ఎగురవేసి కొట్ట టానికి రెండుసార్లు ప్రయత్నించాడు. కాని రెండు సార్లూ తప్పి పోయింది. ఒక నిముషమైనా కాకముందే ఆట చెల్లించి వేశాను. పాపం గయా గంటల తరబడి దోకుళ్ళు పెట్టాడు. కాని తన ఆట నిమిషంలోనే పోగొట్టుకున్నాడు. నేను నా ఉదారత్వ మంతా ప్రదర్శించాను.

"ఇంకో ఆట నువ్వే ఆడు. పాపం మొదట్లోనే చెడిపోయింది నీ ఆట."

"వద్దులే బాబుగారూ! చీకటి పడిపోయింది."

"నీ అలవాటు తప్పిపోయినట్లుందే. ఎప్పుడూ ఆడటంలేదాఏం!"

"ఆడుకోటానికి తీరి కెక్కడుంటుంది బాబుగారూ!"

మే మిద్దరం కారులో కూర్చున్నాం. దీపాలు పెట్టే వేళకల్లా క్యాంపుకు చేరుకున్నాం. "రేపు ఇక్కడ బిళ్ళంగోడు పందాలున్నాయి

మన చిన్ననాటి ఆటగాళ్ళంతా ఆటకొస్తారు. మీరుకూడా వస్తారు గదూ ? మీ తీరిక టైములోనే పిలుద్దాం ఆటగాళ్ళందరినీ' అన్నాడు గయా వెళ్తూ వెళ్తూ.

సాయంత్రమైతే నాకు తీరికగా ఉంటుందన్నాను. మరునాడు ఆట చూడటానికి వెళ్ళాను. పదిమంది పదిమంది ఒక జట్టుగా ఉన్నారు. చాలామంది నా చిన్ననాటి సహచరులే. అందులో చాలా మంది యువకులు. వాళ్ళందరినీ నేను గుర్తించలేకపోయాను. ఆట ప్రారంభమైంది. నేను కారులో కూర్చుని వినోదంగా చూస్తున్నాను. ఆనాడు గయాయొక్క నైపుణ్యం చూచి ఆశ్చర్యపడిపోయాను. దెబ్బ కొట్టాడంటే చుక్కలు తాకేది బిళ్ళంగోడు. నిన్నటిలాగా ఆ సంకోచం కానీ, ఆ వెనుకంజగానీ ఆ అయిష్టతగానీ ఇవ్వాళ మచ్చుకుకూడా లేవు. అతని చిన్ననాటి నైపుణ్యమంతా ఈ రోజు పరాకాష్ఠకు చేరు కుంది. నిన్ననే గనుక ఈ రకంగా నాచేత ఆటపెట్టించి ఉంటే నాకు తప్పకుండా ఏడుపొచ్చుండేదే అతని కర్రదెబ్బ తగిలిందంటే బిళ్ళం గోడు రెండువందల గజాలు పారిపోయేది.

ఆట పెట్టేవాళ్ళల్లో ఒక యువకుడు కొద్దిగా దగాచేయటానికి ప్రయత్నించాడు. బిళ్ళంగోడు ఎగురుతుండగానే పట్టేశా నంటా డతను. కాదు; బిళ్ళంగోడు నేలకు తగిలి ఎగిరితే పట్టుకున్నా వంటాడు గయా. ఆ విషయంలో యిద్దరూ దెబ్బలాడుకోటానికి సిద్ధమైనారు. ఆ యువకుడు వెనుకంజ వేశాడు. జేవురించిన గయా ముఖంచూచి అతను జంకిపోయినాడు, అతనుగనుక తగ్గక పోయినట్టయితే తప్ప కుండా దెబ్బలాట జరిగేదే. మా చిన్నతనంలో మేమంతా సమస్తం మరిచిపోయి ఆటల్లో మునిగి తేలేవాళ్ళం. ఎంతో ఆనందంగా ఉండేది. ఇవ్వాళ నేను ఆటలో లేకపోయినా వాళ్ళు ఆడటంచూస్తుంటే అలాంటి ఆనందమే కలిగింది. నిన్న గయా నాతో ఆడటం జరగలేదనీ, కేవలం ఆడుతున్నట్లు నటించాడనీ యిప్పు డర్థమైంది నాకు. నన్ను చూచి అతను జాలిపడ్డాడు. నేను దగాచేశాను. అబద్ధా లాడాను. అయినా అతని కసలు కోపమే రాలేదు. ఎందువల్లంటే అసలు అత నేమైనా ఆడుతుంటేగా ! నన్ను ఆడిస్తున్నాడు. సంతోష పెడు

తున్నాడు. అంతే! నన్ను బాగా వేధించి నా రసం తీద్దామనే ఉద్దేశ్యం లే దతనికి. నే నిప్పుడు ఆఫీసరును. ఈ హెూదా నాకూ, అతనికీ మధ్య అడ్డుగోడై నిలిచింది. నే నిప్పు డతనివల్ల ఆదరం పొందగలను; గౌరవం సంపాదించగలను, కాని స్నేహం సాధించలేను. చిన్న తనంలో అంటే నే నతని సమఉజ్జీని. మా యిద్దరిలో ఎలాంటి భేదమూలేదు. ఈ పదవి సంపాదించిన తరువాత యిప్పు డిక నేను అతని జాలికి మాత్రమే పాత్రుణ్ణి. ఇక అతను నన్ను తనసాటి వాడుగా భావించుకోలేదు. అతనే గొప్పవా డయ్యాడు. నేనే అల్పుణ్ణయినాను.

# లాటరీ

త్వరలో ఆస్తిపరుడు కావాలన్న తృష్ణ ఎవరికుండదు చెప్పండి. ఆనాడు లాటరీ టిక్కెట్లువస్తే నా స్నేహితుడైన విక్రమ్ నాన్నగారూ, బాబాయి, అమ్మ, అన్నయ్య అందరూ తలకోటిక్కెట్టు కొనేశారు. ఎవరి అదృష్టం ఎలాంటిదో! ఎలా చెప్పగలం? ఎవరి పేరిట వస్తేనేం? డబ్బంతా కుటుంబానికేగా!

కాని విక్రమ్‌కేమీ తృప్తికలుగలేదు. ఇతరుల పేరిట డబ్బు వస్తే తన కేం వస్తుందీ? మహా అయితే తనకో అయిదువేలో పది వేలో యిస్తారు. ఈ డబ్బు అతని కేమూలకూ? అతని జీవితాభిలాషలు చాలా గొప్పవి. మొట్టమొదట తను ప్రపంచమంతా మూల మూలలా యాత్రచేసిరావాలి. పెరూదేశం, బ్రెజిల్ దేశం, టింబక్టూ, హొనోలూలూ యివ్వన్నీ ఉన్నాయి అతని ప్రోగ్రాములో. తుపాను గాలిగా ఒకటి రెండు మాసాల్లో బర్రున తిరిగివచ్చే రకం గాదతను. ఒక్కొక్క ప్రదేశంలో ఎక్కువ రోజులుంటూ ఆ ప్రాంతపు తీరు తెన్నులూ, ఆచార వ్యవహారాలూ వగైరా విషయాలన్నీ అధ్యయనం చేసి, తన ప్రపంచయాత్రను గురించి ఒక పెద్ద గ్రంథం వ్రాసెయ్యాలని

అతని కోరిక. అంతేకాదు; ఒక పెద్ద లైబ్రరీ నిర్మించాలి. అందులో ప్రపంచంలోని ఉత్తమ గ్రంథాలన్నీ ఉండి తీరవలసిందే. లైబ్రరీకోసం రెండు లక్షల వరకూ ఖర్చు పెట్టటానికైనా సిద్ధమే. ఒక బంగళా, కారూ, ఫర్నిచరూ యివి సరేసరి! తండ్రిపేరిటగానీ, పినతండ్రి పేరిటగానీ డబ్బురావటం జరిగితే తనకు అయిదు వేలకంటె దక్కే అవకాశంలేదు. అమ్మ పేరిటవస్తే మాత్రం యిరవై వేలు రావచ్చు. కాని అన్నపేరిటవస్తే మాత్రం తనకొక చిల్లికానీగూడా రాదు. అతను చాలా ఆత్మాభిమాని. ఇంట్లోవాళ్ళ దగ్గరైనా దయాధర్మంగానో, బహుమానంగానో డబ్బు తీసుకోటం అంటే అతనికి చాలా అవమానంగా ఉండేది. 'బ్రదర్! ఎవడినైనా దేబిరించేకంటే ఏగోతిలోనైనా దూకి చావడం మంచిది. మనిషైనవాడు లోకంలో తన కొక స్థానం సంపాదించుకో లేకపోతే ఈ లోకంనుండి సెలవు పుచ్చుకోటం మంచిది' అనేవా డతను

అతను చాలా నిలకడలేని మనిషి. లాటరీటిక్కెట్టుకు యింట్లో వాళ్ళెవరిస్తారు, డబ్బు. అతనుమాత్రం ఎలా అడుగుతాడు? "మనిద్దరం కలిసి ఒక టిక్కెట్టు తీసుకోగూడదూ?" ఎంతగానో ఆలోచించి అన్నా డతను.

ఈ ఏర్పాటు నాకూ నచ్చింది నే నారోజుల్లో బడిపంతులును. ఇరవై రూపాయలజీతం. దాంతో చాలా కష్టంమీద నడుస్తుండేది బండి. పది రూపాయల టిక్కెట్టు కొనటంఅంటే నాకు తెల్ల ఏనుగును కొన్నంతపనే. ఆఁ! ఒక్క నెలరోజులపాటు పాలూ, నెయ్యి, అల్పాహారాలూ, యింకా పైపై ఖర్చులన్నీ మానివేస్తే అయిదు రూపాయలు మిగులుతాయేమో, అయినా భయంగానే ఉంది. ఎక్కడైనా అదనంగా డబ్బు దొరికితే కాస్త ధైర్యంచేద్దును.

"ఇదిగో! నా ఉంగరం అమ్మనా? ఎక్కడో జారిపోయిందని చెప్పేస్తా" అన్నాడు విక్రమ్.

ఉంగరం పదిరూపాయలకు తక్కువ చెయ్యదు. దాంతో టిక్కెట్టు మొత్తం కొనవచ్చు. కానీ ఖర్చుపెట్టకుండానే టిక్కెట్టులో సగభాగస్థుణ్ణవుతుంటే దండ గేముంది?

'కాని బ్రదర్! నువ్వు రొక్కం యివ్వాలిసుమా! అయిదు రూపాయలు తీసుకోకుండా భాగ మియ్యను నేను' అకస్మాత్తుగా అన్నాడు విక్రమ్.

అప్పుడు నాకు ఔచిత్యం జ్ఞాపకానికి వచ్చింది. 'బాగుండదు బ్రదర్! ఈ పని చాలా తప్పు. దొంగతనం బయట పడిందంటే లజ్జపడాలి. నీతోపాటు నాకూవస్తాయి చీవాట్లు' అన్నాను.

చివరకిలా అనుకున్నాం. పాతపుస్తకాలు ఏ సెకండుహేండు షాపులోనైనా అమ్మి, ఆ డబ్బుతో టిక్కెట్టుకొందా మనుకున్నాం. అప్పుడు మావద్ద పుస్తకాలకంటె అనవసరమైన మరేవస్తువులూ లేవు. మేమిద్దరం ఒక్కసారే మెట్రిక్ ప్యాసయినాం. డిగ్రీలుపొంది కళ్ళు పాడుచేసుకుని యింట్లో డబ్బంతా నాశనంచేసినవాళ్ళుగూడా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోటంచూచి మెట్రిక్‌తోనే స్వస్తి చెప్పేశాం మా చదువుకు. నేను బడిపంతులు నయాను. విక్రమ్ గాలికి తిరుగు న్నాడు. మా పాతపుస్తకా లిప్పుడు చెదపురుగులకుమినహా మా కేమీ ఉపయోగంలేదు. వాటిని మేము సమలగలిగినంత నమిలివేశాం. వాటి సారమంతా పీల్చేశాం. ఇప్పు డిక ఎలుకలుతిననీ, చదలుతిననీ మా కనవ సరం. ఇవ్వాళ మే మిద్దరం వాటిని పాతభోషాణంలోనుండి బయటికి తీశాం. దుమ్మూ, ధూళీ దులిపి ఒక పెద్ద కట్టుగా కట్టేశాం. నేను బడిపంతులు నైతిని. నన్నందరూ ఎరుగుదురాయె. మరీ! పుస్తకాల షాపుకు నేనువెళ్ళి పుస్తకా లమ్మటం ఏమంత బాగుంటుంది! అందువల్ల ఆ బాధ్యత విక్రమ్ తీసుకున్నాడు. ఒక అరగంటలో పదిరూపాయల నోటు తీసుకుని గంతులువేస్తూ వచ్చాడు. అత నింత సంతోషంగా ఉండటం నే నెప్పుడూ చూడలేదు. ఆ పుస్తకాలు నలభై రూపాయలకు తక్కువచెయ్యవు. కాని ఆ సమయంలో ఆ పదిరూపాయలూ మా కెక్కడో దోవలో దొరికినట్లుగా ఉంది. ఇప్పుడు టిక్కెట్టులో అర్ధ భాగస్థుణ్ణవుతాను. పదిలక్షలధనం లభిస్తుంది. నా భాగాని కో అయిదు లక్షలూ, విక్రమ్ కో అయిదులక్షలూ వస్తాయి. మేమీ ఆలోచనలోనే మునిగి తేలుతున్నాం.

'అయిదు లక్షలైనా ఏమంత తక్కువమొత్తం కాదులే' తృప్తిగా అన్నాను నేను.

విక్రమ్ నా మాదిరి తృప్తిపడేవాడుకాదు. 'అయిదులక్షలేం ? ఈ పరిస్థితుల్లో ఐదు వందలుకూడా మనకు పెద్దమొత్తమే, కాని జీవితానికి వేసుకున్న ప్రోగ్రామే తలక్రిందులై పోయింది. నా యాత్ర కార్యక్రమం మాత్రం మారటానికి వీల్లేదు. గ్రంథాలయం సంగతే ఎగిరి పోయింది' అన్నాడు.

'యాత్రకు మహా అయితే రెండు లక్షలకు మించేమీ ఖర్చు పెట్టవుగదా !' అతని అభిప్రాయాన్ని వ్యతిరేకిస్తూ అన్నాను.

'అలా కాదండీ ! యాత్రకు వేసిన బడ్జెటు మూడున్నర లక్షలు, ఏడు సంవత్సరాల కార్యక్రమం. సంవత్సరానికి ఏభైవేల రూపాయ లన్నా కావద్దూ ?'

'అంటే సుమారు నెలకు నాలుగువేలనుకో; కాని నెలకు రెండు వేల రూపాయల్లోగూడా దర్జాగానే ఉండొచ్చులే.'

'నేను మంచి రాజఠీవిగా ఉండాలోయ్. బిచ్చగాళ్ళకుమల్లే ననుకున్నావేం ?'

'రెండువేలైనా రాజఠీవిగానే ఉండొచ్చు.'

'నీ వాటాలోనుంచి రెండులక్ష లిస్తేగాని లైబ్రరీ ఏర్పడ దోయ్.'

'నగరంలోకల్లా సాటిలేనిది కాకపోతేనేం నీ లైబ్రరీ ?'

'నిర్మిస్తే అలాంటిదే నిర్మించాలి.'

'అదంతా నీ యిష్టం. నా వాటా డబ్బులోనుంచి నీ కేమీ యివ్వటానికి వీల్లేదు. నా అవసరాలు చూస్తున్నావుగా ! మీ కుటుంబానికి బోలెడెంత ఆస్తి ఉంది. నీ కే బాదరబందీ లేదు. మరి మా కుటుంబ భారమంతా నా మీదే ఉంది. ఇద్దరు చెల్లెళ్ళ పెళ్ళిళ్లు చెయ్యాలి. తమ్ములిద్దరిని చదివించాలి. క్రొత్తగా యిల్లొకటి కట్టించాలి. మొత్తం నా వాటా డబ్బంతా బ్యాంకులో వేసేద్దామని నిశ్చయించుకున్నాను. దానిమీద వచ్చే వడ్డీతో పని జరుపుకుంటాను. నా

తదనంతరంగూడా ఎవరూ ఈ డబ్బును కదిలించటానికి వీల్లేకుండా ఏర్పాట్లు చేస్తాను."

"నీ పరిస్థితుల్లో నీ వాటాలో కొంత ఇవ్వమనడం అన్యాయమే. సరేలే! ఎలాగో నేనే తిప్పలు పడతాలే. కాని బ్యాంకు లిచ్చే వడ్డీరేటు చాలా పడిపోయింది సుమా!"

మేము చాలా బ్యాంకుల వడ్డీరేట్లు పరిశీలించాం. పర్మనెంటు బ్యాంకుల రేట్లూ, సేవింగ్స్ బ్యాంకుల రేట్లూకూడా చూచాం. నిస్సందేహంగా వడ్డీరేట్లు చాలా తక్కువే అనాలి. నూటికి రెండున్నర వడ్డీకి బ్యాంకులో వేయటం దండగే. ఇంతకంటే హాయిగా వడ్డీవ్యాపారం ప్రారంభించగూడదూ? విక్రమ్‌కూడా యాత్రకు ఇప్పుడప్పుడే వెళ్ళకుండా ఆగుతాడూ. జాయింటుగా నడుస్తుంది వ్యాపారం. యాత్రకు కాస్త డబ్బు సంపాదించిన తరువాత వెళ్తాడు. వడ్డీవ్యాపారంలో అయితే మంచివడ్డీగూడా వస్తుంది. మనకు పలుకుబడి ఉంటుంది. కాని ఆసామి ఎంత మోతుబరివాడైనాసరే, గట్టి హామీ లేందే ఎవరికీ డబ్బివ్వకూడదు. అసలు హామీమీద ఎందుకివ్వాలి డబ్బూ? ఆస్తి తాకట్టుపెట్టుకునే యిద్దాం. అలా అయితే ఏమీ ప్రమాదంకూడా ఉండదు.

ఈ ఘట్టంకూడా దాటాం. ఇకపోతే టిక్కట్టు ఎవరిపేరిట ఉండాలన్న ప్రశ్న వచ్చింది. విక్రమ్, టిక్కెట్టు తనపేరిట ఉండాలని పట్టుబట్టాడు. అతనిపేరిట కాకపోతే అసలు టిక్కెట్టే వద్దనేట్టున్నాడు. నాకు మరో ఉపాయం తోచక ఏవిధమైన రాతకోతలూ లేకుండానే అతని పేరిట కొనటానికి అంగీకరించాను. అందుకే తరువాత ఎంతో కలత బడ్డాను.

## 2

ఒక టొకటిగా ఎదురు చూడవలసిన రోజులన్నీ తరిగిపోతున్నాయి. తెల్లవారటం తరువాయి; మా కళ్లన్నీ క్యాలెండరువైపుకు

పరుగెత్తేవి. మా యిల్లు విక్రమ్‌యింటికి అనుకునే వుంది. స్కూలుకు వెళ్ళేముందూ, స్కూలునుండి వచ్చిన తరువాతా మే మిద్దరం ప్రక్క ప్రక్కన కూర్చుని స్కీములు వేసుకుంటుండేవాళ్ళం. ఎలా? ఎవరూ వినకుండా; గుసగుసలాడుతూ. మేము టిక్కెట్టుకొన్న రహస్యం దాచి పెట్టా లనుకున్నాం. ఈ రహస్యం నిజమైనప్పుడు అందరూ ఎంత దంగైపోతారు! అదృశ్యాన్ని నాటకంలోలాగా ఆనందించే అవకాశాన్ని పోగొట్టుకో దలచలేదు.

ఒకరోజు కబుర్లలో పెండ్లివిషయం చర్చకు వచ్చింది. 'బ్రదర్! పెళ్లీ గిళ్లీ ఈజంజాటమంతా నేను తగిలించుకోను. వృధాప్రయాసా, రొష్టూనూ. పెళ్లాం దర్జాలకే బోలెడు డబ్బు ఎగిరిపోతుంది' వేదాంత గాంభీర్యం ప్రదరిస్తూ అన్నాడు విక్రమ్.

'అవును. నీమాట నిజమే ననుకో. కాని జీవితంలోని సుఖ దుఃఖాల్లో పాలు పంచుకునేవాళ్ళు లేకపోతే జీ తానికి ఆనంద మే ముంటుంది! సాంసారిక జీవితమంటే అంతవిర క్తిలేదు నాకు. అయి తే ఒకటి! చివరివరకూ నాతో కలిసిఉండే సహచరిణి కావాలి నాకు. అలాంటి సహచరి భార్యతప్ప మరొకరు కాజాలరు' అతన్ని వ్యతిరే కిస్తూ అన్నాను, నేను

'సరె, సరె! ఎవరిఅభిప్రాయాలు వాళ్లవి. తమ భార్యకో సలాం! కుక్కలమాదిరిగా ఆమెనంటుకుని తిరగటం, పిల్లలను ప్రపంచంలోకల్లా గొప్ప ఐశ్వర్యంగా ఎంచుకోటం, అదంతా భగవత్ప్రసాద మనుకోటం. వాటన్నిటికీ ఓ నమస్కారం! నేను మాత్రం స్వేచ్ఛగా ఉంటాను. ఇల్లువదలి యిష్టం వచ్చినట్లు ఎక్కడి కనుకుంటే అక్కడికి వెళతాను. అనుకున్న తక్షణం ఉడాయించేస్తాను. మళ్ళీ రావాలనిబుద్ధి పుట్టినప్పుడు యింటికి వస్తాను. స్వయంరాజా స్వయంమంత్రీ. ఎప్పుడూ ఒకకాపలా వాణ్ణి నెత్తి కెక్కించుకుంటా ననుకున్నావా? ఇంటికిరావటం కాస్త ఆలస్యమైతే వెంటనే విచారణ— 'ఇంత సేపటిదాకా ఎక్కడికి వెళ్లారూ?' ఎక్కడికైనా బయటికి అడుగు పెట్టారంటే చాలు, తక్షణం ప్రశ్న తయారు— 'ఎక్కడికి వెళ్తున్నారూ?' ఇక దురదృష్టవశాత్తూ భార్యాకూడా వెంటవున్నదంటే చచ్చామన్నమాటే. అప్పుడిక ఎందులో

నైనా దూకి చావటంతప్ప మరో మార్గంలేదు. ఒద్దుబ్రదర్! వద్దు! నాకు నీ విషయంలో వీసమంతైనా సానుభూతిలేదు. కుర్రాడికి కాస్త జలుబుచేస్తే చాలు; అదరాబాదరా పరుగెత్తాలి హోమియోపతిడాక్టరు కోసం. కాస్త మనకు వయస్సుమళ్ళి, పిల్లలు కాస్త పెద్దవాళ్ళయినారో లేదో—యిక మన మెప్పుడుచస్తామా; తాము జల్సాగా తిరిగేఛాన్సు ఎప్పుడు వస్తుందో—అని చూస్తుంటారు. సందు దొరికిందంటే మనకు విషం పెట్టేసి కలరా తగిలిందని ప్రచారం చేసేస్తారు. నాకొద్దుబాబూ ఈ బాదరబందీఅంతా!" అవసరానికి మించిన చిరాకుతో అన్నాడు విక్రమ్.

ఇంతలో కుంతి వచ్చింది. విక్రమ్ చెల్లెలా అమ్మాయి. పది పదకొండేళ్ళుంటాయి. ఆరోక్లాసు చదువుతోంది. వరసగా ఫెయిలౌతోంది. మహా చపలపు పిల్ల, మహాబడాయి కోరునూ. ధబాలున తెరిచింది తలుపులు. మేము వులిక్కిపడి లేచి నుంచున్నాం.

"నువ్వు వట్టి దయ్యానివే కుంతీ! నిన్నెవరు రమ్మన్నారిక్కడికి!" అన్నాడు విక్రమ్.

"ఇక్కడ మీరెప్పుడూ తలుపులు మూసుకుకూర్చుని ఏమిటి గుసగుసలాడుకుంటుంటారూ? ఎప్పుడు చూచినా యిక్కడే కూర్చుని ఉంటారు. షికారుకూ వెళ్ళరూ, సినిమాకూ వెళ్ళరూ. ఏదో మంత్రం జపంచేస్తున్నట్టుందేచూస్తే." గదిలో నలువైపులా సి. ఐ. డి. పోలీసులాగా పరీక్షగాచూస్తూ అన్నది కుంతి.

"ఆఁ! నిజమే! మంత్రమే జపిస్తున్నాం. ప్రతి రోజూ నిన్ను ఛెళ్ళుఛెళ్ళున లెక్కబెట్టి అయిదు కొరడా దెబ్బలు కొట్టే పెళ్ళికొడుకును తీసుకురావాలని" కుంతి గొంతుపట్టుకుని ఊగిస్తూ అన్నాడు విక్రమ్.

"తోకాడిస్తూ నాచుట్టూ తిరిగేవాణ్ణే చేసుకుంటాను నేను. నేను మిఠాయి పొట్లాల కాగితాలు పడేస్తే నాకేస్తాడతను. ఏ మాత్రమైనా నసికాడో చెవులు మెలేస్తాను. అమ్మకు లాటరీపైకంవస్తే నాకు ఏభైవేలిచ్చేస్తుంది. నాకేం? దర్జాగా ఉంటా. నేను రెండు పూటలా అమ్మకోసం దేవుడికి మొక్కుకుంటున్నాను. పెళ్ళిగాని పిల్లలు దీవిస్తే

వృధాగా పోడటని అమ్మ అంటోంది. నాకుమాత్రం అమ్మకు డబ్బు వస్తుందనిపిస్తోంది.

నాకు జ్ఞాపకం వచ్చింది. ఒకసారి నేను మా తాతగారి ఊరికి వెళ్ళాను. అక్కడ వానలు కురవలేదు. భాద్రపదమాసం వచ్చింది. అయినా ఒక్క చినుకుకూడా పడలేదు. అప్పుడు గ్రామస్థులంతా చందాలు వేసుకుని గ్రామంలోని పెళ్ళికాని పిల్ల లందరికీ విందు చేశారు. ఆ తరువాత మూడో రోజునే కుండపోతగా వర్షం కురిసింది. కన్యల దీవెనల్లో మహిమ తప్పకుండా ఉండి తీరుతుంది.

నేనూ, విక్రమ్ ఒకరివైపొకరు అర్థయుక్తంగా చూచుకున్నాం. చూపుల్లోనే మేం సలహాపడ్డాం. ఒక నిశ్చయానికి కూడా వచ్చాం. "మరైతే నీ కొకమాట చెబుతాం. ఎవరితోనూ చెప్పకుండా ఉంటావు కదూ ? నీవు మంచి అమ్మాయివి. ఎవరితోనూ చెప్పవు. నే నీసారి నిన్ను బాగా చదివించి ప్యాసు చేయిస్తాను. అసలు సంగ తేమిటంటే, మే మిద్దరమూ లాటరీ టిక్కెట్లు కొన్నాం. మా తరపునకూడా దేవుణ్ణి ప్రార్థించు. నిజం! మాకుగనుక డబ్బువస్తే నీకు మంచి మంచి నగలు చేయిస్తాం" కుంతితో అన్నాడు విక్రమ్.

కుంతికి నమ్మకం కలుగలేదు. మేము ఒట్లుబెట్టుకున్నాం. ఆమె ఒయ్యారాలు పోతోంది. శిరస్సునుండి పాదాలదాకా మొత్తం శరీర మంతా బంగారంతోనూ, మణులతోనూ కప్పేస్తామని ప్రమాణం చేశాం. అప్పటికిగాని, మమ్మల్ని దీవించటానికి రాజీపడలేదు.

కాని, ఆమె పొట్టలో కొన్ని మణుగుల మిఠాయిలైనా యిముడుతాయి గాని, ఈ కాస్తమాట యిముడలేదు. సరాసరి యింట్లోకి పరుగెత్తింది. ఒక్క క్షణంలో యిల్లంతా వ్యాపించిం దీ వార్త. ఇక ఎవరుబట్టినా విక్రమ్‌ను దబాయించేవాళ్ళే. చివరకు వాళ్ళమ్మ, బాబాయి, నాన్నా అందరూ కోప్పడేవాళ్ళే ఆ కోప్ప డటం విక్రమ్ క్షేమంకోసమో, లేక మరే ఉద్దేశంతోనో ఎవరు చెప్ప గలరు — "ఊరికే కూర్చుని వెధవ ఆలోచనలు చేస్తుంటావు. డబ్బు కాస్తా గంగపాలు చేశావు. ఇంట్లో యింతమందిమి టిక్కెట్లు కొననే కొంటిమి. నువ్వుకూడా తీసుకోవలసిన అవసరం ఏ

మొచ్చింది? కుటుంబానికి వచ్చినదాంట్లో కొద్దోగొప్పో నీకు మాత్రం రాదూ! అయినా మేష్టరుగారూ! నువ్వు వట్టి దద్దమ్మవయ్యా! కుర్రాడికి మంచిమాటలు చెప్పవలసిందిపోయి, వాణ్ణి భ్రష్టుపట్టిస్తావా!"

విక్రమ్ గారాబుకొడుకు. అతన్నింకేమంటారు? అలిగి ఒకటి రెండు పూటలు అన్నం మానేశాడంటే కొంప మునిగిం దన్నమాటే! కోపమంతా నామీదే కక్కేశారు. నా సావాసంతో కుర్రాడు పాడై పోతుం డె మరి!

'అంతా నీతులు చెప్పేవాళ్ళే' అన్న సామెత జ్ఞప్తికి వచ్చింది. నా చిన్ననాటి ఘటనొకటి తలపుకొచ్చింది. ఆ రోజు హోలీపండుగ. ఒక బ్రాందీసీసా తెప్పించారు. మా మేనమామ వచ్చాడప్పుడు. నేను మెదలకుండా గదిలోకి వెళ్ళి గ్లాసులో ఒక గ్రుక్కెడు బ్రాందీ వేసుకు త్రాగేశాను. ఇంకా గొంతు మండుకుపోతూనే ఉంది. కళ్ళు ఎర్రబారి పోయినాయి. ఇంతలో మా మేనమామగారు గదిలోకి వచ్చారు. కన్నంలో దొంగను పట్టుకున్నట్టుగా మండిపడ్డారు నామీద. నాగొంతు పిడచకట్టుకు పోయేట్లుగా కోప్పడ్డారు. అమ్మా, నాన్నగారూకూడా మండిపడ్డారు. నేను ఏడ్చిన తరువాతగాని వారికోపం చల్లారలేదు. ఆ మధ్యాహ్నమే మా మామయ్య విపరీతమైన కైపెక్కి పిచ్చిపాటలు పాడటం మొదలుపెట్టాడు. కాసేపు ఏడ్చాడు. కాసేపు అమ్మను బూతులు తిట్టాడు. అడ్డం చెప్పాడని తాతయ్యను కొట్టొచ్చాడు. ఆఖరుకు వాంతిచేసుకుని వళ్ళుతెలియకుండా పడిపోయినాడు

# 3

విక్రమ్ తండ్రి పెదబాబుగారూ, పినతండ్రి చినబాబుగారూ యిద్దరూ భౌతికవాదులే. పూజలు, పునస్కారాలంటే మహా ఎగతాళి చేస్తారు. పచ్చి నాస్తికులు. కాని యిప్పుడు వాళ్ళు పెద్ద నిష్ఠ పరులూ, మహాభక్తులూ అయిపోయారు. పెద్దబాబుగారు తెల్లవారు ఝామునే గంగా స్నానానికి వెళ్ళేవారు. దేవాలయా లన్నిటిలో

ప్రదక్షిణాలు చేసి మధ్యాహ్నం వేళకు వళ్ళంతా గంధం పట్టించుకుని యింటికి వచ్చేవారు. చిన్నబాబుగారు యింటివద్దే వేడినీళ్ళతో స్నానం చేసేవారు; కీళ్ళవాతంతో అవస్థపడుతూకూడా రామకోటి వ్రాస్తుండేవారు. సాయంత్రమవగానే పార్కువైపుకు షికారు వెళ్ళి చీమలపుట్టలకు పంచదార సప్లయి చేసేవారు. ప్రొద్దుగూకగానే సోదరులిద్దరూ తమ స్వంత దేవాలయానికి వెళ్ళి అర్ధరాత్రయ్యే దాకా భాగవత పురాణం తన్మయులై వినేవాళ్ళు. విక్రమ్ పెద్దన్నయ్యకు యోగులన్నా, బైరాగులన్నా మహానమ్మకం; అతను మతాలచుట్టూనూ; సాధుకుటీరాల వెంబడీ అదేపనిగా తిరిగేవాడు. ఇక అమ్మగారి సంగతి సరేసరి! తెల్లవారుఝామునుండి అర్ధ రాత్రిదాకా స్నానాలూ, పూజలూ; వ్రతాలూ మినహా మరో ఊసే ఉండేదికాదు. ఈ వయస్సులో కూడా ఆమెకు అలంకరణంటే మహా మోజు. కాని యిప్పుడు పెద్ద యోగినిగా మారిపోయింది. కోరికను అనవసరంగా అనర్థకమంటుంది లోకం. మనలో కనబడే ఈ భక్తీ, నిష్టా, మతాభిలాషా-యివన్నీ కేవలం మనకోరికకూ, తృష్ణలకూ ఫలితాలేనంటాను నేను. మన మత విశ్వాసాలకు పునాది మన స్వార్థమే. ఈ కోరిక అనేది మనిషియొక్క మనస్సునూ, బుద్ధినీ యింతగా మార్చి వేయగలుగుతుందనే విషయం నాకు మాత్రం యిది వరకెన్నడూ ఎరుగని సరికొత్త అనుభవం. మేమిద్దరం కూడా అప్పు డప్పుడు జ్యోతిష్కులతోనూ, పండితులతోనూ సంప్రతించి మాలో మేము మధనపడుతుండేవాళ్ళం.

లాటరీ వేసేరోజు సమీపించేకొద్దీ మా మనశ్శాంతి క్షీణించి పోతుండేది. ఎప్పుడూ అదే ఏవగా ఉండేది. నాలో నేనే అనవసరంగా సందేహపడేవాణ్ణి. విక్రమ్ నాకు భాగమివ్వటానికి నిరాకరిస్తే ఏం చెయ్యాలి నేను? టిక్కట్టులో నువ్వసలు భాగం కలవనే లేదని బుకాయించేస్తే? లిఖితాధారమూ లేదు. సాక్ష్యమూ లేదు. అంతా విక్రమ్ నిజాయితీమీద ఆధారపడి ఉంది. అతని బుద్ధి కాస్త చలించిందంటే యింకేముంది? నా కొంప మునిగిందన్న మాటే! ఎక్కడా చెప్పుకోటానికి కూడా అస్కారం లేదు. నోరెత్తటానికి

వీల్లేదు. ఇక అప్పుడు ఏ మంటే ఏం లాభం ? అతని బుద్ధిమారటమే నిజమైతే, ఇప్పటినుండే మొండి చెయ్యి చూపుతాడు. అలా మారి ఉండకపోతే, అంతు లేని బాధపడతాడు. ఎంతో నొచ్చుకుంటాడు. అతను అటువంటివాడు కాదుమరి !... ఏమో ఎట్లా చెబుతాం ? సొమ్ము పాపిష్ఠిది. సంపద వచ్చిపడుతుంటే నిజాయితీగా బతకటం కష్టం. ఇప్పటికి డబ్బేమీ రాలేదు. ఇప్పుడు నిజాయితీగా ఉండటానికి కానీ ఖర్చుపెట్ట నక్కరలేదు. పొయ్యే దేముంది? పది లక్షల రూపాయలు వచ్చి ఒళ్ళోపడుతుందే; అదిగో అదీ పరీక్షా సమయం. నేను నా అంతరాత్మను పరీక్షించుచున్నాను. టిక్కెట్టు నా పేరిట ఉండి పదిలక్షలు నాకే వస్తే మడతపేచీ లేమీ పెట్టకుండా నేను మాత్రం అతని వాటా అతనికి అప్పగించే వాణ్ణేనా ? ఏమో, ఎవరు చెప్పగలరూ ? ఐనా తొంభైతొమ్మిదిపాళ్లు ఏదో నాటకమాడి పేచీయే పెట్టేవాణ్ణి. "నువ్వు నాకు అయిదు రూపాయలు అప్పిచ్చావు, అయి దుకు పది తీసుకో: వంద తీసుకో. అంతే !" అని వుండేవాణ్ణి. కాని... ఛీఛీ ! నేనంత నమ్మకద్రోహం చేసేవాణ్ణి కాదు.

మరుసటి రోజు మేమిద్దరం పత్రిక చదువుతున్నాం. ఇంతలో అకస్మాత్తుగా విక్రమ్ యిలా అన్నాడు—"లాటరీలో నా టిక్కెట్టు రావటం జరిగితే, అనవసరంగా నీతో భాగం కలిశానే" అని నేను చాలా విచారపడవలసి వస్తుంది.

అతను నిష్కపటంగా చిరునవ్వు నవ్వాడు. కాని పరిహాసం చాటున అతను ఎంత దాచిపెట్టాలనుకున్నా అతని మనసులోని మాటే ఇలా బయటపడింది.

"నిజమే ! కాని అలాంటి విచారం నాకూ కలగవచ్చుగా ?"

"కాని టికెట్ నా పేరిట ఉందిగా."

"ఐతే ఏం ?"

"సరే ! మాటవరుసకు నువ్వు నా వాటాదారువు కాదంటా ననుకో !"

నా రక్తం స్తంభించిపోయింది. కళ్ళు చీకట్లు కమ్మిపోయినాయి.

"నువ్వంత నిజాయితీ లేనివాడివి కాదులే !"

"ఏమో, ఎందుకు కాకూడదూ? అయిదు లక్షల రూపాయలు! సామాన్యమా. బుర్ర తిరిగిపోతుంటే!"

"అయితే బ్రదర్! ఎందుకైనా మంచిది. కాగితం వ్రాసి యివ్వు. ఈ అనుమానం ఎందు కుండాలి?"

"నువ్వు వట్టి అనుమానస్తుడివోయ్ బ్రదర్! నేను నిన్ను పరీక్షించుదామని అలా అన్నాను. అట్లా జరగటమే! అయిదు లక్షలు కాదు. అయిదు కోట్లయితేమాత్రం? భగవంతుడు కరుణించాలిగాని, మాట తప్పుతా ననుకున్నావా?" నవ్వుతూ అన్నాడు విక్రమ్.

కాని, అతని ఓదార్పుమాటలవల్ల నా కేమీ నమ్మకం కలగ లేదు. మనసులో ఒక అనుమానం ఏర్పడిపోయింది.

"నీవు నీతి తప్పేవాడివి కాదని నాకు మాత్రం తెలియదూ. అయినా వ్రాసుకుంటేమాత్రం మునిగిపోయిం దేముంది?"

"ఎందుకూ అనవసరంగా?"

"అనవసరమైతే ఏం లే!"

"అయితే స్టాంపుమీదనే వ్రాసుకోవాలి. పదిలక్షలకు కోర్టు ఫీజు ఏడువేల అయిదువందలదాకా అవుతుంది. నీ కేమైనా మతి పోయిందా ఏం?"

ఆలోచించుకున్నాను. పోనీలెద్దూ! మామూలు పత్రం కోర్టు కేమీ పనికిరాదు. అయినా అతని సిగ్గుతీయటానికీ, అతన్ని అవమాన పరచటానికీ, నలుగురిలో వట్టి నీతిమాలినవా డనిపించటానికీ, కాగితం అంటూ ఉంటే అవకాశం ఉంటుంది. లోకంలో అప్రతిష్ఠ వస్తుందన్న భయమే లేకపోతే, యిక మానవుడు ఎంతపనైనా చేస్తాడు. అప్రతిష్ఠ భయం, చట్టపు భయంకంటే మానవుణ్ణి అదుపు చెయ్యటంలో తక్కువ పని చెయ్యదు. "నాకు మామూలు కాగితమైనా నమ్మకమేలే!" అన్నాను నేను.

"వ్యవహారానికి పనికిరాని కాగితాలతో కాలం వ్యర్థం చెయ్యటం ఎందుకులెద్దూ!" నిర్లక్ష్యంగా అన్నాడు విక్రమ్.

విక్రమ్ బుద్ధి యిప్పటికే మారిపోయిందని నాకు నమ్మకం కలిగి పోయింది. లేకపోతే మామూలు కాగితం వ్రాయటానికికూడా

సందేహ మెందుకూ? "నీ బుద్ధి యిప్పుడే మారిపోయిందే!" కోపంగా అన్నాను నేను.

"ఇటువంటి పరిస్థితుల్లో నువ్వు మహా మడిగట్టుకుని ఉంటావని రుజువు చేద్దామనా నీ ఉద్దేశం?" లజ్జయినా లేకుండా అన్నాడు విక్రమ్.

"నే నంత మెతకమనిషిని కాదులే!"

"బయలుదేరాడు పెద్ద నిజాయితీపరుడూ, నీతిపరుడూ. మహా మహా కొమ్ములు తిరిగినవాళ్ళనే చూశాం."

"నువ్వు ఈ క్షణంలోనే కాగితం వ్రాసి యివ్వాలి. నీ మీద నాకు నమ్మకం పోయింది.

"నామీద నమ్మకం లేకపోతే నేనుమాత్రం వ్రాసిస్తా నను కున్నావా?"

"నా డబ్బు జీర్ణమౌతుందనేనా నువ్వనుకోటం?"

"ఎవరి డబ్బూ; ఎట్లా ఉంటుం దా డబ్బు!"

"ఇదిగో చెబుతున్నా విక్రమ్! మన స్నేహం యింతటితో అఖరైపోతుంది. అంతేకాదు. అంతకంటేకూడా విషమ పరిణామాలు ఏర్పడతాయి."

నాలో ప్రతీకారం జ్వాలలాగా చెలరేగి వళ్ళు మండసాగింది.

ఇంతలో అకస్మాత్తుగా ఆఫీసు గదిలో జగడ మాడుకుంటున్న అలికిడి విని నా మనసు అటు మళ్ళింది. అక్కడ బాబుగార్లిద్దరూ కూర్చునేవాళ్ళు. వాళ్ళ స్నేహం ఆదర్శ సోదరుల స్నేహం. రామ లక్ష్మణుల స్నేహంకూడా అచ్చగా యిలాగే ఉండి ఉంటుంది. జగడ మేమిటి; వాళ్ళ మధ్య యెప్పుడైనా తర్కం జరిగినట్టుగా కూడా వినలేదు. పెద్దబాబుగారి మాటంటే చిన్నబాబుగారికి వేదవాక్యం. చిన్న బాబుగారి మనసు కనిపెట్టే పెద్దబాబుగారు ఏమైనా అనేవారు. మాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఆఫీసు గది వాకిలిదగ్గరకు పోయి నుంచున్నాం. సోదరు లిద్దరూ తను కుర్చీల్లోనించి లేచి నుంచుని ఉన్నారు. ఒకటి, రెం డడుగులు ముందుకు వేశారుకూడా. కళ్ళు

చింతనిప్పుల్లాగా ఉన్నాయి. కళ్ళల్లో క్రోధం చిందులు త్రొక్కుతోంది. పిడికిళ్ళు బిగించారు. పరిస్థితి చూస్తే చేతులు కలిసేట్లే వున్నాయి.

చిన్నబాబుగారు మమ్మల్ని చూచి వెనక్కు తగ్గుతూ యిలా అన్నారు: "సమిష్టి కుటుంబానికి ఎలా అన్నా రానీ, ఎవరిపేరటున్నా రానీ; ఆ వచ్చిం దేదో కానీగానీ, దమ్మిడీగానీ అందరికీ సమానంగా రావలసిందే."

"ఎంతమాత్రం వీల్లేదు. నే నేదైనా నేరం చేస్తే నన్నే అరెస్టు చేస్తారు. కాని, కుటుంబాన్నంతా కాదు. ఇది వ్యక్తిగత విషయం" పెద్ద బాబుగారు విక్రమ్‌ను చూచి, మరో అడుగు ముందుకు వేసి అన్నారు.

"ఆ సంగ తేదో కోర్టు తేలుస్తుంది."

"మహరాజుగా వెళ్ళు కోర్టుకు. నా పిల్లల పేరిటగానీ, నా భార్య పేరిటగానీ, నా పేరిటగానీ లాటరీవస్తే దాంతో నీ కెలాంటి సంబంధమూ లేదు. అలాగే లాటరీ నీ పేరిట వచ్చినా నాకుగానీ, నా భార్యకుగానీ, పిల్లలకుగానీ దాంతో యెలాంటి సంబంధమూ ఉండదు."

"మీ బుద్ధి యిలాంటిదని తెలిసుంటే నేనుకూడా నా భార్యా, పిల్లలపేరిట టిక్కట్లు తీసుకొని ఉండేవాణ్ణి."

"అది నీ తప్పు!"

"మీరు నా సోదరులనుకోబట్టే అలా అయింది."

"నువ్వొక విషయం తెలుసుకోవాలి. ఇది జూదం. జూదంలో వచ్చే జయాపజయాలకు కుటుంబాని కేమీ సంబంధం లేదు. రేపు నువ్వు అయిదువేలో, పదివేలో గుర్రపు పందాల్లో నష్టపోతే అందుకు కుటుంబాని కేమీ బాధ్యత లేదు."

"కాని, సోదరుడి హక్కులు కాజేసి మీ రేమీ బాగుపడరు."

"నువ్వేం బ్రహ్మవా? భగవంతుడివా? మహాత్ముడివా?"

సోదరు లిద్దరికీ బెడిసిందనీ, ముష్టియుద్ధం జరగబోతున్నదనీ విని, పరుగెత్తుకుంటూ వచ్చింది విక్రమ్ తల్లి. ఇద్దరికీ నచ్చచెప్పటం ప్రారంభించింది.

"మీరు నా కేమీ నచ్చచెప్ప నక్కరలా. నాలుగు నాలుగు టిక్కెట్లు ముడివేసుకు కూర్చున్న ఆయనగారికి చెప్పండి నా దగ్గ రేముందీ? ఒక్క టిక్కెట్టు! అది వస్తుందని నమ్మక మేముంది? నాకంటే డబ్బు రావడానికి నాలుగురెట్లు ఛాన్సున్న ఆయనకు చెడు బుద్ధి పుట్టిందంటే అంతకంటె లజ్జమాలిన, విచారకరమైన విషయం యిం కేమైనా ఉందీ?" చిన్నబాబుగారు మండిపడుతూ అన్నారు.

"ఇదిగో! నా డబ్బులో సగం నీకే యిస్తాగా! ఇక ఊరుకో!" ఓదార్చుతూ అన్నది వదినగారు.

పెదబాబుగారు భార్యమీద విరుచుకుపడ్డారు – "సగ మెందు కిస్తాం? ఒక్క కానీకూడా యివ్వను మొగమాటపడిగానీ, మంచి తనంవల్లగానీ యిచ్చినా అయిదోవంతుకంటె ఏ విధంగానూ రాదు. ఆలోచించి చూచినా, ధర్మప్రకారమైనా, నైతికసూత్రప్రకారం చూచినా సగంభాగం ఏ చట్టప్రకారం వస్తుందీ?"

"లోకంలో చట్టాలన్నీ తమ కొక్కరికే తెలిసింది!"

"ముప్పది సంవత్సరాలు చేశాను ప్లీడరీ. తెలుసుగా?"

"కలకత్తా బారిస్టరు వచ్చి యెదుట నుంచుంటే వదిలిపోతుంది, ఈ ప్లీడరీ కాస్తా."

"కలకత్తా బారిస్టరైతేనేం? లండన్ బారిస్టరయితేనేం? లెక్కా? జమా?"

"కుటుంబానికి సంబంధించిన ఆస్తిలోలాగానే యిందులోనూ నాకు సగ భాగం రావలసిందే."

ఇంతలో విక్రమ్ అన్నగారు తలకూ, చేతికీ కట్లు కట్టించుకుని, కుంటుకుంటూ నెత్తురు మరకలు నిండిన బట్టలతో ప్రసన్న వదనుడై ఒక పడక కుర్చీలో వచ్చి కూలబడ్డాడు. "ఏమి టిదంతా ప్రకాశ్! అరే! ఈ దెబ్బ ఎలా తగిలింది? ఎవరితోనైనా దెబ్బలాడలేదుగదా!" గాభరాగా అడిగాడు పెదబాబుగారు.

ప్రకాశ్ కుర్చీలో పడుకుని ఒక్కసారి మూలిగాడు. తరువాత చిరునవ్వు నవ్వుతూ "ఏం లేదులెండి: ఏమంత పెద్దదెబ్బ తగులలేదు లెండి" అన్నాడు.

'చెయ్యీ, తలా మొత్తం వాచిపోయినాయి. గుడ్డలు నెత్తురు ముద్దయినాయి. ఇంకా పెద్దదెబ్బ తగులలేదు లెమ్మంటూ వేమిటి? అసలు జరిగిం దేమిటో చెప్పు. కారు ప్రమాదమేమీ కాదుగదా?'

'మామూలు దెబ్బలేనండి నాన్నగారూ! రెండు, మూడు రోజుల్లో అదే నయమైపోతుంది. ఏమీ గాభరా పడనక్కరలేదు లెండి!'

ప్రకాశ్ ముఖంలో ఆశ, నిబ్బరం నిండిన చిరునవ్వు చిందు లాడుతోంది. లజ్జా, క్రోధాలుగానీ ప్రతీకారభావంగాని మచ్చుకైనా కానరావటం లేదు.

అస లింతకూ జరిగిం దేమిటో చెప్ప వెందుకనీ? ఎవరితో నైనా దెబ్బలాట జరిగితే చెప్పు, పోలీసులకు రిపోర్టు చేస్తాను.' మరింతగా వ్యాకులపడుతూ ప్రశ్నించాడు పెదబాబుగారు.

'దెబ్బలాటేమీ జరుగలేదు నాన్నగారూ! అసలు జరిగిం దేమిటంటే ... నేను ఝుక్కడ్‌బాబా వద్దకు వెళ్ళాను. మీకు తెలుసుగా; ఆయన మనుషులు కంటబడితే చాలు పారిపోతాడు. రాళ్ళు తీసుకుని వెంబడిపడతాడు. పరుగెత్తి పారిపోయినవాడు దురదృష్టవంతుడే. కాని రాళ్ళదెబ్బలు తినిగూడా ఆయన్నంటుకు తిరిగినవాడికి మాత్రం పట్టిందల్లా బంగార మన్నమాటే. ఆయన ఆవిధంగానే పరీక్షించుతాడు. ఇవ్వాళ నేనూ అక్కడికి వెళ్ళాను. అక్కడొక యాభైమందిదాకా ఉన్నారు జనం. కొందరు మిఠాయిలు తీసుకొచ్చారు. కొందరు ఎంతో విలువైన బహుమతులు తెచ్చారు. మరి కొందరు బట్టల తానులు తెచ్చారు. ఝుక్కడ్‌బాబా తపస్సులో ఉన్నాడు. అకస్మాత్తుగా ఆయన కళ్ళు తెరిచాడు. ఈ జనసమూహాన్ని చూచాడు. బోలెడు రాళ్ళు ఏరుకుని వాళ్ళ వెంబడి పడ్డాడు. గోలగోలగా పరుగెత్తారు జనం. పడుతూ లేస్తూ పారిపోయారు. అంతా జారిపోయారు. ఒక్కడుకూడా నిలువలేకపోయినాడు. గడియారపు స్తంభంలాగా దృఢంగా నిలబడింది నే నొక్కడినే. ఇంకేముంది? ఆయన రాయిని విసరనే విసిరాడు. మొదటిదెబ్బ తలకు తగిలింది. అతని గురి తప్పనే తప్పదు. పుర్రె చిట్లింది. నెత్తురు ధార

గట్టి పారింది. ఐనా నేను చలించలేదు. బాబా మళ్ళీ మరో రాయి విసిరాడు. అది చేతికి తగిలింది. నేను క్రింద పడిపోయాను. స్పృహ తప్పిపోయింది. తెలివి వచ్చిన తరువాత చూస్తే అక్కడంతా నిశ్శబ్దం గానే ఉంది. బాబాకూడా మాయమైనాడు. ఆయన అలాగే అంత ర్ధానమౌతుంటాడు. ఇకప్పుడు ఎవరిని పిలవనూ? బండి తెమ్మని ఎవరికి చెబుతానూ? బాధతో చెయ్యి బద్దలై పోతోంది. తలనుండి రక్తం యింకా కారుతూనే ఉంది. ఎలాగో లేచి తిన్నగా డాక్టరు వద్దకు వెళ్ళాను. ఆయన పరీక్షచేసి ఎముక విరిగి పోయిందన్నాడు. వెంటనే కట్టుకట్టాడు. వేడినీటితో కాపటం పెట్టమన్నాడు. డాక్టరు మళ్ళీ సాయంత్రం వస్తాడు... దెబ్బ తగిలితే తగిలిందిలే. ఇక లాటరీ మాత్రం నా పేరిట వచ్చిందన్నమాటే. ఇందులో ఏమీ సందేహం లేదు. ఝుక్కడ్ బాబాచేత దెబ్బతిని అనుకున్న పని కాకుండా ఉన్న వాడు యింతవరకూ మచ్చుకైనా లేడు. నేను అన్నిటికంటే ముందు బాబాకు ఆశ్రమం కట్టిస్తాను."

పెద్ద బాబుగారి ముఖంలో ఆనంద రేఖలు చిందులాడినాయి. వెంటనే పక్క పరిచారు. ప్రకాశ్ దాని మీద పడుకున్నాడు. వాళ్ళమ్మ విసరటం ప్రారంభించింది. ఆమె కూడా సంతోషంగానే ఉంది. ఇంత దెబ్బతిని పదిలక్షలు సంపాదించటం దండుగ వ్యాపార మేమీ కాదు.

చిన్న బాబుగారికి ఆకలి మండి పోతోంది. పెదబాబుగారు భోజనానికి వెళ్ళారు. ఒదిన గారు కూడా ప్రకాశ్‌కు భోజనం ఏర్పాటు చెయ్యటానికి వెళ్ళింది. వెంటనే చినబాబుగారు ప్రకాశ్‌ని ప్రశ్నించాడు—"రాళ్ళు జోరుగా విసురుతాడా?" జోరుగా ఎందుకు విసురుతాడూ!"

ప్రకాశ్ ఆయన మనసులో ఉద్దేశ్యమేమిటో అర్థం చేసుకుని "అమ్మబాబో! అతను వేసేవి రాళ్ళా! ఫిరంగి గుళ్ళయితే. మనిషి మంచి ఆజానుబాహుడు ఎంత బలవంతు డనుకున్నా! ఒక్క గుద్దుతో వస్తాదులు గూడా నిగిడి చావాల్సిందే. అంతంత మాత్రం మనిషైతే ఒక్క రాయితోనే సరి! ఎంత మంది చనిపోయారు.

అయినా యింతవరకూ ఝక్కడ్ బాబామీద ఒక్క కేసు గూడా పెట్టలేదు. ఒక్కటీ, రెండూ రాళ్ళు విసరి ఊరుకుంటా డనుకున్నారా! క్రిందపడి స్పృహతప్పిందాకా రాళ్లు విసరుతూనే ఉంటాడు. కాని అక్కడే ఉంది కీలకం. మీ రెంత ఎక్కువగా దెబ్బలుతింతే మీ కోరిక అంత గట్టిగా నెరవేరుతుంది' అన్నాడు.

ఆ విషయాన్ని చినబాబుగారు వణకిపోయేటంత భయంకరంగా చిత్రింహాడు ప్రకాశ్. ఇక ఆయనకు అలా దెబ్బలు తినేందుకు ధైర్యం చాలలేదు.

# 4

చివరకు అదృష్టం నిర్ణయమయ్యేరోజు వచ్చేసింది. జూలై 20 వ తేదీ! తెల్లవారటమే తరువాయి. ఖూనీ జరిగిపోతుంది. మేము వేకువఝామునే లేచాం. ఆశా, భయం రెండూ మిశ్రమమైన ఒక విధమైన కైపులో ఉన్నాం మేము. బాబుగార్లిద్దరూ యింకా బాగా ప్రొద్దుండగానే గంగా స్నానం చేసి మందిరానికివెళ్ళి పూజలో కూర్చున్నారు. ఇవ్వాళ నా హృదయంలో భక్తిభావం జాగృతమైంది. మందిరానికి వెళ్ళి లోలోపలే భగవంతుణ్ణి స్తోత్రం చెయ్యటం ప్రారంభింవాను — 'అనాథరక్షకా! నీ దయారస మొక్కసారి మాపై ప్రవహింపజేయవా? లాటరీ టిక్కెట్టు మే మెంత శ్రమపడి కొన్నామో నీకు మాత్రం తెలియదా? నీవు సర్వాంతర్యామివే! నీకు తెలియని విషయ మేముంది చెప్పూ! ఈ ప్రపంచంలో నీ దయకు పాత్రులైనవారు మా కంటె మరెవ్వరున్నారు ప్రభూ!' విక్రమ్ సూటూ, బూటూ వేసుకుని మందిరం ద్వారం వద్దకు వచ్చాడు నన్ను సైగతో పిలిచి 'ఇదిగో! నేను పోస్టాఫీసుకు వెళ్తున్నాను' అని మాత్రం బర్రున వెళ్ళిపోయాడు. ఇంక కాసేపటికి ప్రకాశ్ మిఠాయిపళ్ళెములు తీసుకుని యింట్లోనుండి

వచ్చి మందిరం వాకిట్లో నిలబడి అక్కడ గుమిగూడిన బీదలకు మిఠాయి పంచుతున్నాడు. ఇక బాబుగారిద్దరూ తలవంచి, కళ్లు మూసుకుని భక్తి పరవశులై భగవధ్యానంలో ఉన్నారు.

పెద్దబాబుగారు తలఎత్తి పూజారివైపు చూస్తూ, "ఏమంటారు స్వామీ ? భగవంతుడు భక్తవత్సలుడు గదూ !" అన్నాడు.

"చిత్తం ! చిత్తం ! భక్తరక్షణార్థమే గదండీ శ్రీ మహావిష్ణువు క్షీరసాగరంనుండి పరుగులెత్తి గజేంద్రుణ్ణి రక్షించిందీ!" అయన మాటలను బలపరుస్తూ అన్నాడు పూజారి.

ఒక నిమిషం ఆగి చిన్నబాబుగారు తలఎత్తి "ఏమండీ! భగవంతుడు సర్వశక్తివంతుడూ, సర్వాంతర్యామీ గదండీ! అందరి హృదయాలనూ అర్థం చేసుకోడూ ?" అన్నాడు.

"చిత్తం! చిత్తం! సర్వాంతర్యామి కాకపోతే సర్వుల హృదయాలనూ ఎలా అర్థం చేసుకుంటాడు చెప్పండి ! శబరి భక్తిశ్రద్ధలు గ్రహించి స్వయంగా వచ్చి ఆమె కోరిక నెరవేర్చాడుగదండీ, మహానుభావుడు !"

పూజలు పూర్తయినాయి. హారతిచ్చారు. సోదరులిద్దరూ యివ్వాళ పెద్దగా మంగళహారతులు పాడారు. పెద్దబాబుగారు పళ్లెంలో రెండు రూపాయలు వడ్డించారు. చిన్నబాబుగారు నాలుగు రూపాయలు వడ్డించారు. పెద్దబాబుగారు ఒక్కసారి కోపంగా చూచి ముఖం అటు త్రిప్పుకున్నారు.

ఉన్నట్టుండి పెద్దబాబుగారు "మీ మనసు కెలా ఉంది స్వామీ!" అని ప్రశ్నించారు పూజారిని.

"తమదే విజయం సందేహం లేదు."

"మరి నా సంగతి ?" ప్రశ్నించారు చినబాబుగారు.

"తమరూ జయిస్తారు." వెనకటంత గట్టిగానే నొక్కి చెప్పాడు పూజారి.

పెద్ద బాబుగారు భక్తి పరవశత్వంతో—

ఏ తీరుగ నను దయ జూచెదవో యినవంశోత్తమ రామా !

శరణు కోరితిని సరగున బ్రోవుము దశరథ తనయా రామా!
అంటూ తన్మయులై మందిరం నుండి బయలుదేరారు.

"దశరథ రామా గోవిందా - నన్ను
దయ చూడు మహానుభావా!" అంటూ

మరొక నిముషానికి చిన్నబాబుగారుకూడా భజన చేసుకుంటూ మందిరంనుండి బయలుదేరారు.

వెంబడే నేను కూడా బయలుదేరి మిఠాయిలు పంచుతున్న ప్రకాశ్‌కు సహాయం చేయబోయాను. కాని ఆయన "మీ రెందుకు లెండి! ఇదిగో యిప్పుడు పంచెయ్యనూ? ఇక ఉన్నది మాత్రం ఎంతలెండి!" అంటూ పళ్ళెం పక్కకు త్రిప్పుకున్నాడు.

నేను లజ్జపడుతూ పోస్టాఫీసువైపుకు బయలుదేరాను. ఇంతలో విక్రమ్ ముసిముసి నవ్వులు నవ్వుతూ సైకిలుమీద వచ్చేశాడు. వాణ్ణి చూడగానే అందరికీ వెర్రెత్తిపోయింది. బాబుగార్లిద్దరూ ముందే నిలబడివున్నారు. డేగల్లాగా వెళ్ళిపడ్డారు యిద్దరూ. ప్రకాశ్ పళ్ళెంలో యింకా కొంతమిఠాయి మిగిలివుంది. పళ్ళెం నేలమీద పడేసి అతనూ పరుగుతీశాడు. ఇక నే నా ఉన్మాదంలో విక్రమ్‌ను చంకకెత్తుకున్నాను. కాని అసలతన్ని ఎవరూ ప్రశ్నించటమే లేదు. అంతా జయజయ ధ్వానాలుచేస్తూ వెర్రికేకలు పెడుతున్నారు.

"జయ్! రాజా రామచంద్ర ప్రభువుకూ జై!" ఆకాశంవంక చూస్తూ నినదించాడు పెదబాబుగారు.

"జయ్! వీరహనుమాన్‌కీ జై!" ఒక్క గంతువేసి పొలికేక పెట్టాడు చిన్నబాబుగారు.

"ఝుక్కడ్ బాబా జిందాబాద్" చప్పట్లు కొడుతూ వెర్రిగా అరిచాడు ప్రకాశ్.

విక్రమ్ యింకా పెద్దగా పకపకానవ్వి దూరంగా నుంచుని "గెలిచినవాళ్ళు ఒక లక్ష రూపాయలు నా కివ్వాలి. ఇష్టమేనా మరి?" అన్నాడు.

"మొదట చెప్పూ మరి!" విక్రమ్ చెయ్యి లంకించుకుని ప్రశ్నించాడు పెదబాబుగారు.

"ఉహుఁ! ఊరికే చెప్ప కేం?"

"కబురు చెప్పినందుకే లక్ష రూపాయలా! మంచి మొనగాడివే!" కోపంగా అన్నాడు చినబాబుగారు.

"పోష్టాఫీసు మా కేం తెలియ దనుకున్నావా?" ప్రకాశ్‌కూడా ముఖం చిట్లించాడు.

"సరే అయితే. మీ పేర్లు వినటానికి సిద్ధంగా ఉండండి."

అందరూ మిలిటరీ అటెన్షన్ పోజులో నుంచున్నారు.

"మెదడును ఆర్డరులో ఉంచుకోండి."

అందరూ పూర్తి జాగ్రత్తలో ఉన్నారు.

"అయితే చెవులు తెరుచుకొని మరీ వినండి. ఈ పట్టణమంతా క్షౌరమైంది. ఈ పట్టణమే కాదు; భారతదేశం అంతా క్షౌరమైంది. అమెరికాలో ఒక నీగ్రోవాడు గెలిచాడు.

"అబద్ధం! అబద్ధం! పచ్చి అబద్ధం!" మండిపడ్డాడు పెదబాబుగారు.

"అసంభవం! మూడునెలల తపస్సు వృధాకావటమే బలే!" పూనికగా నిలబడి ఊగుతూ అన్నాడు చిన్నబాబుగారు.

"ఒకప్రక్క యిక్కడ తల పగలగొట్టించుకుని, చెయ్యి విరగ్గొట్టించుకొని కూర్చుంటే పరిహాసమాడుతున్నావా?" గుండెలు బాదుకుంటూ అన్నాడు ప్రకాశ్.

ఇంతలో వందల జనం అటునుండి ఏడుపుముఖాలతో బయలుదేరారు. పాపం వాళ్ళంతా పోస్టాఫీసుకు వెళ్ళి తమ అదృష్టానికి విలపిస్తూ తిరిగి వస్తున్నారు. "అమెరికా నీగ్రో కొట్టేశాడురా! దౌర్భాగ్యుడు! సైతాను! దుర్మార్గుడు!" అనుకుంటున్నారు.

ఇంకా నమ్మకుండా ఎవరుంటారు? పెద్దబాబుగారు మండిపడుతూ మందిరానికి వెళ్ళారు.

"ఇన్నాళ్ళబట్టీ నిన్ను పోషించింది యిందుకేనా? తేరసొత్తు తింటూ దర్జాగా కులుకుతున్నావా?" పూజారిని ఉద్యోగంలోనుండి తీసివేస్తూ అన్నాడు పెదబాబుగారు.

ఇక చిన్నబాబుగారి గుండెలు జారిపోయినాయి. రెండుమూడు సార్లు తలబాదుకుని అక్కడే కూర్చుండిపోయినాడు. కాని, ప్రకాశ్ కోపానికి హద్దేలేదు. అతను దిట్టమైన తన లాఠీ తీసుకుని రుక్కడ్ బాబాకు దేహశుద్ధిచేయటానికి బయలుదేరాడు.

"అందరూ ద్రోహమే చేశారు. ఇక భగవంతు డేం చేస్తాడు? ఇతరుల సొత్తు లాక్కుని మన కివ్వమంటే యిస్తాడా?" అని మాత్రం అన్నది విక్రమ్ తల్లి.

ఆనాడు రాత్రి ఎవరూ భోజనం చెయ్యలేదు. నేను కూడా దిగాలుపడి కూర్చుని ఉన్నాను. ఇంతలో విక్రమ్ వచ్చి "హోటలుకు పోయి ఏమైన తినొద్దాం పద! ఇవ్వాళ యింట్లో పొయ్యి రాజలేదు" అన్నాడు.

"సరేగాని పోస్టాఫీసునుండి వచ్చేప్పుడు నువ్వు సంతోషంగా ఉన్న కారణమేమిటి చెప్పు!" అడిగాను నేను.

"పోస్టాఫీసు ముందున్న వేలజనాన్ని చూచేసరికి మన ప్రజల అజ్ఞానానికీ, మూర్ఖత్వానికీ నవ్వు వచ్చింది. ఒక్కపట్నంలోనే యింత మంది ఉంటే, భారతదేశంలో యింతకు వెయ్యిరెట్లకు తక్కువ ఉండరు ఇక ప్రపంచం మొత్తంమీద లక్షరెట్లకు మించే ఉంటారు. ఆశలతో నేను నిర్మించుకున్న మహాపర్వతం కాస్తా క్షణంలో నలుసుగా మారిపోయింది. అందుకే నవ్వు వచ్చింది నాకు. అరగిద్దెడు బియ్యపు అన్నం అరచేతిలో ఉంచుకుని లక్షమంది ప్రజలకు విందుచెయ్యటానికి తయారైనాడట ఒక దానకర్ణుడు.........అట్లాగే మా యింట్లో ఒక్కొక్కడూ ఎంతెంత పోకడలు పోయాడు! ..." అంటూ నవ్వాడు.

నేనూ నవ్వాను - 'నిజానికి నీ వన్నది నిజమే! మనిద్దరం వ్రాతకోతలకోసం కీచులాడుకు చచ్చాం. సరేగాని, ఒక్కటడుగుతా; కాని నిజంచెప్పాలి సుమా! నీ బుద్ధి మారిందా లేదా చెప్పు!'

'ఇప్పుడు తెలుసుకునిమాత్రం ఏంప్రయోజనం? దా న్నలా తెరచాటునే ఉంచు!'



# 1963 ప్రచురణలు

| | | |
|---|---|---|
| సప్తపది : | మాలతీచందూర్, ఇల్లిందుల సరస్వతీదేవి, డా॥ శ్రీదేవి, రామలక్ష్మి, వరలక్ష్మమ్మ, దుర్గాకుమారి, సరళాదేవి | 1-00 |
| పన్నీరు - కన్నీరు : | నందివాడ భీమారావు | 1-50 |
| కండక్టరు కథ, పెద్దిగాడి మేక : | పెండ్సె | 1-50 |
| జోడెద్దులు : | ప్రేమ్‌చంద్ | 1-50 |
| శాస్త్రీయవిజ్ఞానము : | కొడవటిగంటి కుటుంబరావు | 1-50 |
| పావ్లావ్ పరిశోధనలు : | ,, | 0-75 |
| పిల్లల మనస్తత్వశాస్త్రము : | ధూర్జటి సుబ్బారావు | 2-50 |
| నుడి నా నుడి : | తిరుమల రామచంద్ర | 3-00 |
| తొలిమజిలి : | ఆదివిష్ణు | 1-50 |
| ప్రజల మనిషి : | వట్టికోట ఆళ్వారుస్వామి | 3-00 |
| జయ యౌధేయ : | రాహుల్ సాంకృత్యాయన్ | 4-50 |

పోస్టేజి అదనం!

---

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ - 4



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్ |
| | పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RE.HB08I 116 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 9/1/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 111 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI,4,107 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | sandhya |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |